కథా సాహితీ స్రవంతి– 3

# కృష్ణాంజలి

శాంతి కృష్ణమూర్తి

ఇదొక
యశోధర ప్రచురణ

యశోధర ప్రచురణ-3
తొలి ముద్రణ
సెప్టెంబర్ 1955

హక్కులు రచయితవి
వెల 1-0-0



ముద్రణ:
ఆంధ్ర ప్రింటింగ్ వర్క్సు,
వరంగల్.

ప్రచురణ:
యశోధర పబ్లికేషన్స్,
హనుమకొండ, వరంగల్.

ఈ సంపుటిలో....

పెత్తల్లి

అన్నపూర్ణమ్మగారికి

కృష్ణుడు

అంజలి ఘటించి

సమర్పించే

కథానికా పుష్ప గుచ్ఛం

"కృష్ణాంజలి"

# ఒక నిముషం

ఇందులో కొన్ని సాంసారిక కథలూ, ఒక చారిత్రిక కథా వున్నాం అన్నీ ఏదో ఒక సాంఘిక ప్రయోజనాన్ని కలిగి వున్నవే.

వీటి మంచి చెడ్డల్ని నిర్ణయించాల్సింది పాఠకులూ, విమర్శకులు ఇవన్నీ గత పది సంవత్సరాల జీవితానుభవంలో నుండి వెలువడినవి. అనుభవజ్ఞులైన వివిధాభిరుచులు కల పత్రికా సంపాదకుల సంపాదకీయక కరగాకుండా ప్రచురింప బడ్డాయి.

వీటిని చదివిన సహృదయులైన పాఠకులు తమ అమూల్యాభిప్రాయాల్ని తెలుప గలిగితే ఎంతో కృతజ్ఞుడై వుంటాను. ప్రస్తుతానికి సెలవు.

మీ

కృష్ణమూర్తి

---

# రెండు మాటలు

నేడు కథా రచన సాగుతున్నంత ముమ్మరంగా ఇంతవరకూ ఎప్పుడూ లేదు. అసంఖ్యాకమైన రచయితలూ, పాఠకులూ తయారవుతున్నారు ఇదంతా చాలా శుభ సూచన. తెలుగు మాట్లాడే జనం మూడుకోట్ల వరకు వున్నారు. ఇంత పెద్ద జనాభాగల దేశంతో పోల్చి చూస్తే మన స్థితి ఇం వెనకనే వుందనాలి.

ఇతోధిక కృషి ద్వారా సారస్వతాభివృద్ధికి తోడ్పడాలనే వు తోనే ఈ ప్రచురణలను పూనుకున్నాం. మాకు ఇది వరకు ఆదరాభిమ లను చూపిన పాఠకులకు, నవీన పాఠకులకూ కృతజ్ఞత తెలుపుతూ ఈ స టిని సమర్పిస్తున్నాం.

ఇందులో ఆంధ్ర పత్రిక, ఆంధ్ర ప్రభ, ఆంధ్ర జ్యోతి, తెలు స్వతంత్ర, ఆనందవాణి, నవజీవన, నవోదయ, తెలుగుదేశం మొదలైన ప్రముఖ పత్రికలలో ప్రకటింప బడిన కథలు 12 ఉన్నాయి.

అడగగానే తమ కథల నిచ్చి మమ్ము ప్రోత్సహించిన శ్రీ కృష్ణ మూర్తి గారికి మా కృతజ్ఞత తెలుపుతున్నాం.

సంపాదకుడు

# నిష్కామకర్మ

రైల్లో ఎక్కి బెడ్డింగ్ పర్చాక, మూడో తరగతి ప్రయాణీకులకు రైల్వేవారు చేసే సదుపాయాలు చాలవన్నట్టు కమలాకర్.

కొద్దిసేపట్లోనే పెట్టె నిండింది. 'టకప్'లో వున్న ...రో పెద్ద మనిషి రైలు కదిలే వేళ ఎక్కి కమలాకర్ని ఈర్ష్యతో చూడ సాగాడు. చేతిలో తోలుసంచీ యేదో వుంది.

స్థలం చాలక నుంచున్న మరికొందరు పెద్దమనుష్యులు కాళ్లు పీకడం వల్లనో, చెల్లిస్తున్న హెచ్చు రేట్ల బాధవల్లో, రైల్వే వాళ్లనీ, పడుకున్న వాళ్లనీ, విధినీ అందర్నీ నిందించ సాగారు.

"మిస్టర్! కొంచెం పక్కన కూర్చోవచ్చా!" అన్నాడు ఆ ఆగంతకుడు.

"నిరభ్యంతరంగా" అన్నాడు కమలాకర్.

ఆయన చేటంత మొహంచేసుకుని, అక్కడ కూర్చొ

"ఎందాక?" అన్నాడు.

"మదిర......మీరో?"

"వైజాగ్"

రైలు కదలడంతో జనం రొద కొంచెం తగ్గింది. సమయాంతరాళ్ళు సమంగా కలిగిన రైలుధ్వని వింతగా వీనులకు సోకసాగింది.

అంతవరకూ నుంచున్న వాళ్లంతా బెడ్డింగ్‌లపైనా, పెట్టెలపైనా, తమకి తోచిన చోట్ల కూర్చోసాగారు.

"మొన్న జనగామ దగ్గర జరిగిన రైలు ప్రమాదం గురించి విన్నారా?" అన్నాడాయన.

కమలాకర్ గుండె జలదరించింది. పైకి "వినకేం? విన్నాను. అప్పటి నుంచీ రైలు ప్రయాణమంటేనే అందరికీ హడలుగా వుంది" అన్నాడు.

"ఆ రైల్లో నేనూ వున్నాను!"

కమలాకర్ ఆతురత ఎక్కువైంది.

"మీరా? ఎలా బతికారు?"

"అంతా దైవికం అనుకోండి. ఆలేరులో 'చా' తాగడానికి వెళ్ళాను. రైలు కదిలింది. నా పెట్టె దాటిపోయింది. గత్యంతరం లేక చివరి బోగిలో ఎక్కాను, ఖాజీపేటలో సామాను తీసుకోవాచ్చని. కొంతసేపట్లో వర్షం భోరున కురవసాగింది. అన్ని కిటికీలు మూసేసుకున్నాం. రైలు ప్రకృతితో పోరాటం చేస్తూ ముందుకు మహావేగంతో సాగిపోతోంది. చాలామంది పెట్టెలో నిద్రపోయారు కూడా. నేను ఏదో పత్రిక చదవసాగాను

"ఉన్నట్టుండి ఆకస్మికంగా పిడుగులు పడినట్టు చప్పుడైంది. మా పెట్టె గట్టిగా కుదిపినట్టయి ఆగిపోయింది. దీపాలు ఆరిపోయాయి. అందరూ ఆ కుదుపుకి క్రింద పడ్డారు. బయట గాఢాంధకారం; భోరున వర్షం; హోరునగాలి.

"పదిహేను నిమిషాల వరకూ ఎవరూ కోలుకో లేదు. సామానులు అవీ నెత్తిమీద పడినవాళ్లు, తదితరులు గోల చెయ్యసాగారు.

"తెగించి నేను మరి కొంతమంది బయట పడ్డాం.

ఏముంది? సముద్రంలా ఎడతెగని ప్రవాహం. పాముల్లా మెరుపుల్లో మెరుస్తోన్న రైలు పట్టాలు. తక్కిన రైలు కనపడలేదు.

"తక్కిన విషయాలు పేపర్లలో చదివే వుంటారు మీరు. నాకు టీ తాగాలని తోచక పోయినా, నా పెట్టె దాటిపోక పోయినా, నా పేరు ఆ మృతజీవుల పట్టికలో చేరేదే".

ఆ గాథ. కమలాకర్ కి ఆ ఘోర దృశ్యమంతా కళ్లకు కట్టినట్టయింది. వొళ్ళు జలదరించింది. కళ్ళు చెమ్మగిల్లాయి. "అదృష్టవంతులు!" అని మాత్రం సణిగాడు.

బయట రైలు వేగంగా పోతోంది. చలిగాలి రైలుతో యుద్ధం చేస్తో, బలవంతంగా లోపలికి వీచసాగింది.

రైలు ప్రయాణీకులు ప్రాణాలన్నీ గుప్పిళ్లల్లో పెట్టుకుని వున్నారు.

"ఇదంతా ఎందుకు చెప్పానో మీరు గ్రహించలేనట్టుంది" అన్నాడాయన.

కమలాకర్ "మీ అనుభవాన్ని చెప్పారు" అన్నాడు.

"దానితో పూర్తి కాలేదు, నా అనుభవం. చావవల్సిన వాణ్ణి బతికేసాననే సంతోషంతో బాటు నిజంగా చచ్చివుంటే నా కుటుంబానికి దిక్కేది? అనే బాధ కూడా పీడించసాగింది.

"వెంటనే హనుమకొండలో వున్న ఓ ఇన్సూరెన్సు కంపెనీ ఆఫీసుకు వెళ్ళి 20 వేల రూపాయలకు జీవితభీమా చేశాను ఎందుకనుకున్నారు? నాకోసం కాదు! నా సంతానం కోసం! నా భార్యకోసం! కంపెనీ వాళ్ళు నా తెలివికి ఎంతో మెచ్చుకున్నారు. నన్ను తమ కంపెనీ ఏజంటుగా నియమించారు.

"ఆ గండం గడిచిన నా స్వానుభవం అంతా మూటకట్టుకుని, మృత్యుగహ్వారం నుంచి బయటపడ్డ నేను మిమ్మల్నొకటే అడుగదల్చుకున్నాను"

"ఏమిటది?"

"మీరు లైఫ్ ఇన్సూర్ చేశారా?"

"లేదు"

"అయితే వెంటనే చెయ్యండి. నేను స్వార్థంకోసం కాదు చెప్పేది. అంతా నిష్కామకర్మ- భగవద్గీతలో చెప్పినట్టు. ఈ రోజుల్లో జీవితాలు శాశ్వతం కావు. బయటికి వెళ్ళినవాడు ఇంటికి వచ్చే వరకూ నమ్మకం లేదు. అందుకే నామాట వినండి"

కమలాకర్‌కి ఇప్పటికి కథ అర్థమైంది. వెంటనే రఘ్గకప్పుకుని నిద్ర నటించ సాగాడు. ★

## గింజలు మిగిలాయి!

డాలయ్య ఫాక్టరీ నించి వొచ్చి, తినెమీద కూచున్నాడు. పక్కింటి ముసలమ్మ తాళాలు తీసుకొచ్చి ఇచ్చింది, ఇతను రావడం పసిగట్టి.

"అదేదీ?" అన్నాడు డాలయ్య.

"ఏమో, నాతో సెప్పింది కాదు" అంది ముసలమ్మ.

డాలయ్య తలుపు తీసుకొని, బుడ్డి వెలిగించాడు. ఆ మినుకు మినుకు మనే దీపం సాధ్యమైనంత వరకూ చీకటిని తరిమి వేస్తోంది. వస్తువులన్నీ ఎక్కడివక్కడే వున్నాయి.

అదేమైందో తెలీదు. ఎవ్వరితోనూ చెప్పనట్టుంది. అదే వొస్తుందనే నమ్మకంతో దాలయ్య తన పనులన్నీ చేసుకుంటున్నాడు. దూరంగా బొంకెను మేరలో వున్న ఒరల నుయ్యికి చాద తీసుకొని బయలు దేరాడు.

చన్నీళ్ళ స్నానం, పొద్దున్న నించీ, ఎంతో శ్రమపడ్డ అతనికి కొంత మనశ్శాంతి నిచ్చింది. అంతసేపూ ఏవో ఆలోచనలు మెదడులో పరుగెడుతున్నాయి 'ఎప్పుడూ ఇట్లా చేసేది కాదు. ఈ వేళ ఏమొచ్చిందని? ఎవరన్నా చుట్టాలూ పక్కాలూ వున్నారేమో- అదీ కనపడదు.

పోనీ స్నేహాలు...అవి అసలే లేవు. ఎవళ్ళతోనూ పదినిమిషాలకంటె ఎక్కువసేపు మాట్లాడేది కాదు. ఏమన్నా అంటే తను, "హాఁ పోదు! పిరికోళ్ళతోనూ మాటాడ్డానికి ఏటుంది?" అనేది.

ఆకలి తీర్చుకొందుకు దాలయ్య ముంతలు వెదుకుతున్నాడు. కాస్త గంజి, వరి అన్నం వుంది ఓమూల- తనొక్కడికే సరిపోయేంత

'అదేమాతుంది? తిండికూడా తినదేటి?' అనుకున్నాడు.

మాడుతూన్న కడుపు మళ్ళీ ఆ మాట జ్ఞాపకానికి రాకండా చేసింది. అంచేత తనకి కావాల్సిందంతా తడుము కోకండా తినేశాడు.

ముంతలు మామూలుచోటుంచి- వీధిలో నులక మంచం వేశాడు, గుడిసె కెదురుగా.

తక్కిన గుడిసెల్లో మనుషులు తమ తమ సొంత గోడవల్లో పడున్నారు. కొందరు అలసిపోయిన తమ భర్తలకి సేద

దీరుస్తున్నారు. కొంతమంది తమ పిల్లలకి అన్నం తినిపిస్తున్నారు. మరికొందరు, కిరసనాలు కరువు వల్ల ముందరగానే అన్నాలు తిని- వీధిలో వేసవి కాలపు రాత్రి చల్లని గాలికి చేరారు.

దాలయ్య రావడం చూసిన కొందరు, తీరుబడిగా వున్న వాళ్ళు, అక్కడే కొస్తున్నారు. దాలయ్యకి ఎందుకో మొదట అర్థం కాలేదు. కాని క్రమంగా వాళ్ళ మాటలు తను- ఫాక్టరీలో వుండగా జరిగిన సంఘటనని తెలిచేస్తున్నాయి.

"దానింట వాన గురవ! పాపం, నిన్నిట్టా జేసి..."

ఓ ముసలమ్మి పరామర్శ చేస్తోంది. ఆమె వెనకాలే ముసిముసి నవ్వులు నవ్వుతోన్న పడుచులు- 'అది గనక అంత నీచ కార్యం చేసింది; మేమెంత మంచి వాళ్లమో చూసుకో!' అన్నట్టు చూస్తున్నారు.

ఈపాటికి దాలయ్యకి అదేమైందో అర్థమైంది. పరామర్శ అవగానే వొచ్చిన వాళ్ళు మెల్లిగా జారుతున్నారు.

దాలయ్య ఆలోచనలో పడ్డాడు. తనేం లోటు చేశాడని? దాని కోసరమే కదా ఇంత చెమటోడుస్తుంట. పోనీ ఇష్టం లేదని ఏ క్షణంలోనన్నా చెప్పలేదే. అనుమానాన్నికైనా తావివ్వ లేదు, ఈ ఎనిమిదేళ్ల స్నేహం లోనూ. చివరికి వెళ్ళే టప్పుడు కూడా, తను ఏం కష్టపడతాడోనని, గంజి కాచి, తాళాలు ఎవరికో యిచ్చి వెళ్ళి పోయింది. నిజంగా యిష్టం లేని వాళ్ళెవరేనా ఇట్లా చేస్తారా? ఇష్టం లేదని, ముక్కల కింద కోసినా, అనుకోగలగడం అసంభవం.

మరి, ఎందుకు లేచిపోయింది? దానికే, ఎంత ఆలో

చించినా సమాధానం రావడం లేదు.

తనకంటె ఆకర్షవంతమైన, ఎక్కువ సౌఖ్యాలు ఇచ్చే...అదే ఐ వుండాలి. కాని ఇట్లా అనుకుందుకూ సరైన ఆధారం లేదు. ఎందుకంటే తను ప్రస్తుతం జీవిస్తున్న పద్ధతి తో విసిగినట్టు, ఒక్క పిసరైనా తెలపలేదు, కొత్త దారులు తొక్కదామనుకుందుకు.

దాలయ్యకి, అది లేచిపోయినందుకు విచార మెయ్య లేదు గాని యింత తెలియ జెప్పకుండా పోవడమేమా? అని విచారంగా వుంది. అంత యిష్టం లేకపోతే తను బలవంతం చేస్తే మాత్రం ఏం సుఖంగా వుంటుంది ఆ కాపరం.

ఏదీ తేల లేదు.

చీకటిలో ఏదో మనిషి నీడలా తన వైపు ఒస్తోంది. అదేమో ననుకున్నాడు.

"ఎక్కడికి కెళ్ళావ్?" అన్నాడు ఆత్రంతో.

వొచ్చే మనిషి కంఠం సవరించింది. క్రమంగా మొగా డని స్పష్ట పడింది.

దాలయ్య నాలిక కొరుక్కొని "ఎవరారు?" అన్నాడు.

"నేనా! సేషిగాడ్ని"

సేషయ్య వొచ్చి పక్కగా బండరాయి మీద కూచున్నాడు.

"ఏం విచారంగా వుందా?" అన్నాడు ఓదార్పుకి.

"అసలు జరిగిందేటి? సరిగ్గా చెప్పు" అన్నాడు దాల య్య— అంతా తెల్సుకుందామని.

సేషయ్య కొంచెం దగ్గర స్నేహితుడు. డబ్బు నిల

వున్నవాడు. ఓ సొంత జట్కా ఉంది. దాన్ని తోలుకుని స్వతంత్రింగా బతుకుతున్నాడు.

"పట్నంలో కారు స్టాండ్ దగ్గర కనపడ్డాది. మన మెకానిక్ లేడూ, అతగాడు పక్కనున్నాడు. నేను ఎక్కడ్నించో బండి తోలుకొస్తున్నాను. ఇక్కడుందేవిటా? అని ఆశ్చర్యమేసింది! కాని ఏమని అడగడానికీ భయమేసింది.

"అక్కడికీ అడిగాను 'ఇదేమిటే?'అని. మెకానిక్ టికట్టు తీసుకుందుకు కారు దగ్గర కెళ్ళాడు.

" 'ఆయనతో పోతున్నాను ఆయనకూడా నన్ను పిలిచాడు. మాకు మనసు కుదిరింది.' ఇక్కడ కొంత సేపు ఆగి మళ్ళీ అందుకుంది. 'వాడంటే ఇష్టం లేదని కాదు; పిచ్చి మన సుండ బట్టలేక పోయింది. యిట్టా చేశానని తొప్పడొద్దను. ఎప్పటికీ మరిసిపోనని సెప్పు' అంది.

"ఇది నీకు చెబుదామనే వచ్చాను."

అంతా చెప్పి- దాలయ్య- ఏం పెద్ద షాక్ తింటాడో నని— మొఖంకేసి దీక్షగా చూస్తున్నాడు సేషయ్య.

పక్క గుడిసెల వాళ్ల సద్దు మణిగింది. పక్షులు చెట్ల మాటు నుండి రొద జేస్తున్నాయి. కీచురాళ్ల కుంతలు కూడా ఎక్కువగానే వున్నాయి. ఏ చెట్టూ లేనిచోట ఆముదపు చెట్టే మహా వృక్ష మైనట్టు, సూర్యుడూ చందుడూ లేని ఆకాశానికి అధినాథుల్లా నక్షత్రాలు మెరుస్తున్నాయి.

సేషయ్య చెప్పిందంతా దాలయ్య శాంతంగా విన్నాడు. అంతా విని చివరికి ఓ నిట్టూర్పు విడిచాడు. అతనేం మాట్లాడనందుకు ఆశ్చర్య మేసింది సేషయ్యకి.

తన స్త్రీయే ఇట్లా చేస్తేనా? తక్షణం వెళ్ళి దాని ప్రాణమైనా తీసేవాడు, తనైనా చచ్చేవాడు. అంతేకాని దాలయ్య పౌరుషం లేనట్టు ఇదేమిటి?

సేషయ్యకి పాలుపోలేదు.

దాలయ్య ఇంటిచూరు తాటాకు పీకి, పళ్ళతో ముక్కల కింద కొరికి అవతల పారేస్తున్నాడు. మళ్ళీ కాసేపు తల గోక్కుంటున్నాడు. లోపల ఏ మాలోచిస్తున్నాడో, ఏ నిర్ణయాలకి వొచ్చాడో గాని, పైకి గంభీరంగా కనపడుతున్నాడు. ఆరాటపడ్డ మనస్సు ధీరోదాత్తంగా శాంతం వహించింది.

"ఏమంటావ్?" అన్నాడు సేషయ్య, వెళ్ళిపోవడానికి లేస్తూ.

దాలయ్య ఆకాశంలో నక్షత్రాల్ని పిచ్చిగా లెక్కబెడుతూ అన్నాడు:

"అనడానికేముంది? ఈ కరువు రోజుల్లో 'గింజలు మిగిలాయి' అంటానంతే!" ★

## "వివాహిత"

ఏనాడూ లేంది ఆ వేళ ఉదయాన్నే కృష్ణప్రసాదు గత రోజు ఆంధ్రపత్రిక కొన్నాడు, హోటల్ నుంచి తిరిగొస్తూ.

ఏవో కొన్ని వార్తల్ని చదివాడు. తర్వాత రకరకాల ప్రకటనలు అతని దృష్టిపథాన్నాకర్షించకుండా వుండలేక పోయాయి. అందులో ముఖ్యమైంది నర్సాపూర్ వితంతు శరణాలయంవారి ప్రకటన.

అతన్ని ఒకవిధమైన జాలి ఆవహించింది. ఈ మగ వాళ్ళ స్వభావాన్ని చూస్తే అతనికే అసహ్యం వేసింది. రోజూ వృత్తి చేసుకునే వేశ్యల దగ్గరికి పోవడానికి సిగ్గు చెందని ఈ మనుషులు వితంతు వివాహాన్ని పాపం కింద నిషేధించారు. అలాంటి సంస్కారానికి దిగిన వ్యక్తుల్ని అసహ్యించుకున్నారు. ఎప్పటికీ వాళ్ళని అమర్యాదతో చూడ్డానికి ప్రయత్నిస్తారు.

ఇంకా ఏవో ఆలోచనలు అతని తలలో మెరిశాయి. వాటికో స్వరూపం ఇచ్చుకుందుకు ప్రయత్నించ సాగాడు.

చప్పున ప్రభావతి గుర్తుకు వచ్చింది. నాలుగేళ్ల తర్వాత మళ్ళీ ఈ వేళ తన మనోదృష్టిని పూర్తిగా లోబర్చుకుంది.

మొదటిసారి పరిచయం ఎప్పుడు ఏర్పడింది? తన హృదయంలో ఆమె ప్రతిబింబం ఎందుకిలా హత్తుకుపోయింది? అతనికే తెలియ లేదు — ఎంతగా ఆలోచించినా.

  

వాళ్ళు ఆవూరు వచ్చిన రోజుల్లో నేల్లకి తను జామ చెట్టు యెక్కి కాయలు కోసుకుంటున్నాడు. ప్రభావతికి అప్పుడు పదకొండేళ్ళు. వాళ్ళింటి భాగాన్నే అద్దెకి తీసుకుని వున్నారు.

ప్రభావతికి నోరూర సాగింది. చాలాసేపు కళ్ళు అప్పగించి చూసింది. కాని చివరికి అడుగలేదు కృష్ణప్రసాద్ ఇదంతా గమనించక పోలేదు. కాని అతనూ ఇవ్వడానికి ధైర్యం చెయ్యలేదు.

మరోనాడు ప్రభావతి తండ్రి — ఒక తహశీల్దారు — కాంపునించి వచ్చి యిచ్చిన మిఠాయిని అరుగుమీద కుర్చీలో

కూచుని తినసాగింది. కృష్ణప్రసాద్ అవతల అరుగుమీద కూచుని చదువుకుంటున్నాడు. ఈ వేళ అతను మళ్ళీ క్లిష్టపరిస్థితిలో పడ్డాడు. ప్రభావతి ఆలోచించి, ఒక ఉండ అతనికిచ్చింది, అతను వొద్దంటున్నా. తీసుకోక తప్పలేదు.

ఇలాంటి సంఘటనలే ఏవో వాళ్ళ స్నేహానికీ, ప్రేమకీ కారణమయ్యాయి. అల్లా రెండేళ్ళు గడిచాయి.

ఒకరోజు సాయంత్రం చీకటి పడిందో లేదో ప్రభావతి తొందరగా వచ్చి, అతన్ని డాబామీదికి తీసుకుపోయింది.

"ఏమిటి సంగతి?"

ప్రభావతి, తన పెళ్ళి విషయమై తల్లి, తండ్రి మాటలాడుకున్నారనీ; తనకు అతన్నే తప్ప ఇతరుల్ని పెళ్ళాడే వుద్దేశం లేదనీ— రెండు రోజుల్లో పెళ్ళివారు చూపులకు వస్తారనీ, అతన్నేదో నిర్ణయించుకొని తక్షణం తేల్చమనీ అడిగింది.

అతనాలోచించి అన్నాడు:

"నేను నిన్ను మనసారా ప్రేమిస్తున్నానని, నువు తెలుసును. ఇంక ఇంతగా ఎందుకు ప్రశ్నిస్తావో నాకు తెలియదు"

ప్రభావతి చెమ్మగిల్లిన కళ్ళని తుడుచుకుని చేతిలో చెయ్యి వేయించుకుంది.

ఆరోజే అతనికి మను వరాసింది. అదే తర్వాత అతని జీవితంలో కొంతమార్పు తెచ్చింది.

అల్లా ప్రతిజ్ఞ తీసుకున్న రెండు నెల్లకే ప్రభావతి తండ్రికి బదిలీ అయింది. తర్వాత ఏవో ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచినా అంత ఎక్కువ అవకాశం లేకపోయింది వాళ్ళ స్నేహానికి. తన వివాహం నిశ్చయమైనా తను ఏ పరిస్థితు

ల్లో లొంగిపోయిందీ తెలియబరుస్తూ, హృదయ భారాన్ని వ్యక్తీకరిస్తూ, ప్రభావతి రాసిన చివరి ఉత్తరం అతన్ని కదిపేసింది. వాళ్ళ వూరు వెళ్ళి ప్రభావతిని రహస్యంగా కలుసుకున్నాడు. ప్రభావతి విడిగా వున్న ఆ కొద్ది నెలల్లోనూ, ఎంతో విజ్ఞానాన్ని పెంపొందించుకున్నట్టు కనిపించింది. కృష్ణప్రసాద్ ఇతర మార్గాల్ని ఆలోచించి చెప్పాడు. కాని ఏవీ సాధ్యాలుగా కనిపించలేదు. చివరికి "సంసారనౌకని సంతోషంగా నడుపుకో" అని అశ్రుపూరిత నేత్రాలతోనే ఆశీర్వదించి, సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. కాని హృదయాంతరాళాల్లో ప్రభావతి కూడా ఎంత బాధపడుతున్నదీ, అతనెరగంది కాదు. ఆడవాళ్ళలో కన్పించే గాంభీర్యం ఆమెలో గోచరించింది, అతని కప్పుడు.

◆ ◆ ◆

ఇన్నాళ్ళకి మళ్ళీ తన ఆలోచనల్ని దోచుకొంది ప్రభావతి. ఇప్పుడు సంతోషంగా వివాహ జీవితం గడుపుతూ వుంటుంది ఎవరన్నా పిల్లలు కలిగారేమో? భర్త పరీక్ష పాసై ఇంజనీరుగా వుండి వుంటాడు.

తర్వాత కృష్ణప్రసాద్‌కి కూడా వైరాగ్యం కలిగింది. తల్లి తండ్రులు పెళ్లి విషయమై రెండు మూడుసార్లు హెచ్చరించినా అతను పెడచెవిని పెట్టాడు.

కాని వివాహం సంఘంలో కొంతవరకూ తప్పనిసరిగా కనిపించింది. పైగా ఈ మధ్య వొంటరితనం కూడా ఎక్కువైంది. జీవితంలో అశాంతి ఎక్కువ కాసాగింది అంచేత అంగీకరిద్దామా? అనుకుంటున్నాడు. బి.ఏ., చదివినా ఉద్యోగం

చెయ్యటం లేదు; చేద్దామనే కోరికా లేదు.

తండ్రి చనిపోవడంతో ఇంటిభారం నెత్తిమీద పడింది, తల్లి పెళ్ళి చేసుకోమని పోరసాగింది. విధిగా నౌకరీ వెతుక్కోవలసి వచ్చింది.

ఇంటిలో చెప్పకుండా కృష్ణప్రసాద్ నర్సాపురం వెళ్ళాడు. అక్కడ మేనేజరుతో తన ఆశయం చెప్పి పిల్లల్ని చూసి ఏదో ఒక వివాహం చేసుకోందామని ఉద్దేశ పడ్డాడు. అల్లా అయితే తల్లి కోరికా తీరుతుంది. తన ఈ సంస్కారం వల్ల కొంత అశాంతీ తగ్గుతుంది.

మేనేజరు చిన్న వుపన్యాసం ఇచ్చాడు. తమ సంఘ ఆశయాన్ని గురించీ, నేటి యువకుల సంకుచిత బుద్ధుల్ని గురించీ, ఇతనిలాంటి కొందరు సాహసవంతుల్ని గురించీని. కృష్ణప్రసాద్‌కి అది అతను సర్వసాధారణంగా ఇచ్చే వుపన్యాసంలా కనిపించింది.

తర్వాత లిస్టును గురించి చెప్పాడు. ఇంటిలో అట్టే సంఘర్షణ రాకుండా, తన కులంవాళ్ళనే ఎంచుకుందామనుకున్నాడు కృష్ణప్రసాద్ — తన సంస్కార భావాలకు పరిమితుల నేర్పరుస్తున్నందుకు చింతిస్తూ. మేనేజర్ కూడా వచ్చి అందరినీ చూపించాడు. అతన్ని ఆశ్చర్యంతో ముంచెత్తేలా ఆ చివరి అమ్మాయి ఎవరు? అతన్ని చూడగానే ఎందుకలా సిగ్గుపడుతుంది? చివరికి పారిపోయింది కూడా! మేనేజరు "సిగ్గు పడుతోంది, ఆ అమ్మాయి" అన్నాడు.

కాని ప్రభావతా? ఆమెకీ దురవస్థ ఎందుకు వచ్చింది? అట్లాంటి పేరు మేనేజరు చెప్పలేదే? ఎంత ఆలోచించినా అత

నికి తెగ లేదు.

అవతలకి వచ్చాక మేనేజర్ని అడిగాడు ఆమెని కల్సుకోనిమ్మని.

మేనేజరు సిగ్గుతో పారిపోయిందనుకున్న అమ్మాయి గదిలో వెక్కి వెక్కి ఏడుస్తోంది. ఎవరడిగినా చెప్పదు.

ప్రభావతి మాత్రం అతన్ని కల్సుకుందుకు ఇష్టపడలేదు.

కృష్ణప్రసాద్ పూర్వ చరిత్ర అంతా చెప్పి తనే ఆమె గదికి పోయాడు. కాని ప్రభావతి సరిగా మాట్లాడ లేదు. భర్త చనిపోయాడనీ, తల్లీ, తండ్రీ పునర్వివాహానికి వొప్పుకో లేదనీ; మేనమామే స్వంత బాధ్యతమీద ఇక్కడకు పంపాడనీ చెప్పింది

మర్నాడు పెళ్ళి జరగడానికి అక్కడే ఏర్పాటు జరుగుతుందని చెప్పి కృష్ణప్రసాద్ తన గదికి పోయాడు. అతన్ని ఆశ్చర్యం, విషాదం అన్నీ బాధపెట్ట సాగాయి. అంతులేని సముద్రం మధ్య ఈదుతూన్న వాడిలా వుంది అతని పని.

మర్నాడు ఉదయం ప్రభావతి గదిలో ప్రభావతి లేదు; పెట్టెలేదు. ఎవర్నడిగినా ఎవరికీ తెలియదన్నారు. ఊరంతా వెతికించి, మేనేజరు 'తన విచారాన్ని' తెలియజేశాడు.

కృష్ణప్రసాద్ ఆమె మేనమామ ఎడ్రెస్ తీసుకుని అక్కడికి వెళ్ళాడు. ప్రభావతి యిల్లా ఎందుకు వెళ్ళిపోవాలో అతనికి ఎంత ఆలోచించినా అర్థం కాలేదు. తన్ని పెళ్ళిచేసుకుందుకు ఇష్టంలేదా? అది తనకు ఎందుకు తెలియచెయ్యకూడదూ?

మేనమామ అతన్ని ఆదరించాడు. ప్రభావతి అక్కడే

వుంది. ప్రభావతిని సముదాయించాడు.

వారం రోజుల్లో, ఆయన అధ్వర్యాన్నే వాళ్ళకి సంస్కార వివాహం జరిగింది

కాని ఆ రాత్రి ప్రభావతి అతని చేత చేతిలో చెయ్యి వేయించుకొన్న విషయం ఎవ్వరికీ తెలియదు ఆమెకీ, అతనికీ తప్ప. ఆనాడే ఆమె వివాహిత!

సన్నజాజి మొక్క వాసనల్ని మోసుకొచ్చి, పెళ్లివారి వళాల్తో కలుపుతున్న గాలి 'నాకుకూడ తెలుసు' అనుకుంది.

★

## సమస్య తీరింది!

"మీ పేరేనా సుకుమార్?" అన్నాడు, కళ్ళజోడు పైనించి అతన్ని చూస్తూ, లోపలప్రవేశిస్తున్న ఒకముసలాయన.

అంతవరకు కిటికీలో కూచుని, వొదుల్తున్న నీలిపొగ ల్లోంచి, నీలాకాశాన్ని చూస్తో, స్వాప్నిక జగత్తుల్లో ఊహా విమానాలపై పయనిస్తున్న సుకుమార్ ఉలిక్కిపడిలేచి, సిగ రెట్ ఆర్పి పారేసి, "రండిసార్! నమస్తే నాపేరే!" అన్నాడు.

ఆయన నిలబడ లేనట్టుగా ఈజీఛైర్ ని ఆక్రమించేడు.

సుకుమార్ నుంచునే వున్నాడు.

"కూచోండి. మీతో ఒక అర్జంట్ విషయం మాట్లాడ దామని వొచ్చాను. కొంచెం సావకాశంగా వినాలి" అన్నా డాయన, ఒక పొడి దగ్గు దగ్గి.

ఏమీ అర్థంకాక సుకుమార్ శక్తిహీనుడిలా కూచు న్నాడు "చెప్పండి" అంటూ.

"ఆ; ఏం లేదు. మా అమ్మాయి మొన్న ఆంధ్రా మెట్రిక్ కు కట్టింది. కాని కట్టుదిట్టం లేని మూలాన పాస్ కాలేదు. మీరు కొంచెం దయుంచి, తప్పక మా ప్రార్థన అంగీకరించి, రెండు నెల్లు కష్టపడి ప్రైవేట్ చెప్పినట్టయితే, మీ రుణాన్ని ఎప్పటికీ తీర్చుకోలేని వాళ్ళమవుతాం. మీ కష్టానికి తగిన ప్రతిఫలం ఇయ్యడానికి సిద్ధంగా వున్నాను" అన్నాడు ముసలాయన.

సుకుమార్ హృదయం తేలికపడింది. ఇది వరకు ఆయన్ని చాలాసార్లు రోడ్ మీద చూసాడు. కాని ఏదో అనుమానంతో తనవైపు చూస్తున్నట్టుగా తోచి మనస్సులో చాలా బాధపడ్డాడు. తర్వాత ఆయన చూపుల్ని తప్పించుకునే తిరిగేవాడు. ఆలాంటి వ్యక్తి తన గదికి రావడంతో, మొదట మనస్సుని ఎదో ఆందోళన పీడించ నాగింది. ఇపుడది నివృత్తి అయింది.

సుకుమార్ వెంటనే అన్నాడు: "మీకు తెలీదనుకుంటాను, ట్యూషన్లు చెప్పే అలవాటు నాకు లేదని. చాతనైనంత వరకూ స్కూల్లోనే చెబుతాను, అంతే! నన్ను క్షమించండి!!"

ముసలాయన వొదల దల్చుకోలేదు. "ఆ విషయం తెల్సి వొచ్చాను. ప్రత్యేకం డబ్బుకోసం కక్కుర్తిపడే వాళ్లెప్పుడూ సరిగా చెప్పనే చెప్పరు. రెండు వందల రూపాయల వరకూ ఇవ్వగలను. మీరు తప్పక శ్రమపడాలి" అన్నాడు.

రెండు వందలు! సుకుమార్ వొళ్ళు జలదరించింది. ఎన్ని కాప్స్టన్ సిగరెట్ల పాకెట్లు వొస్తాయి! పట్నంవెళ్లి ఎన్ని సినిమాలు చూడవచ్చు! వెధవ నియమాలు! అంత డబ్బు

వొస్తుంటే వాటిని వొదులుకుంటే నేం?

అప్పటికీ "మరేమి లేదండీ! నాకు అలవాటు లేదు. ఫలితానికి గ్యారంటీ ఇవ్వలేను. అందుకే ఆలోచిస్తున్నాను" అని సణిగాడు

"దానికి మీరేంచేస్తారు?" అని సమాధాన మిచ్చాడు ఆ ముసలాయన.

"ఐనా, సాయంత్రంవొచ్చి పరీక్ష చేస్తాను. అప్పుడు గాని ఏమాటా చెప్పలేను"అని కొసిరాడు సుకుమార్.

ఆయన "థాంక్స్! తప్పక రండి"అని వెళ్ళాడు.

## 2

అ పట్నంలో సుకుమార్ ని ఎరుగనివాళ్లెవరూవుండరు. ఉన్నత పాఠశాలలోని వుపాధ్యాయులందరిలోను చిన్నవాడు కావడమేకాక, సర్వవిధాలైన లలితకళలకు ఆలవాలమైన ఆ నగరంలో సుకుమార్ పాల్గొనని నాటక ప్రదర్శనగాని, సాహిత్య సభలుగాని, త్యాగరాజ మహోత్సవాలుగాని వుండవు. ఈ కళాప్రియత్వముకూడా అతనికి ప్రజా సన్నిహితత్వం కొని తెచ్చింది. అందుకే అతన్నెరుగనివారు లేరు.

అంతేకాదు! రెండువందల రూపాయలు తెచ్చుకునే అవివాహితుడు ఊళ్లో వుండడం పెళ్లికాని పంతులమ్మలకు, ఈడొచ్చిన విద్యార్థినులకూ కూడా ప్రత్యేకాకర్షణ అవడంలో ఆశ్చర్యం ఏమీ లేదనుకుంటాను.

ముసలాయన వెళ్ళాకసుకుమార్ కు ఎన్నో ఆలోచనలు కలిగాయి :

తానసలు ఆడపిల్లలకి చదువుచెప్పగలడా? మొగవా

ళ్లయితే నయానో భయానో చెప్పవచ్చును! కానివిద్యార్థి నులతో ఎలా! ఆ అమ్మాయెలావుంటుందో? ఎలాంటిదో? ఛా! ఎలాంటిదైతే తనకేందుకు? తన పని తను సరిగా చేసుకుంటే చాలు.

'ప్యాసవడానికి మీరెలా గ్యారంటి ఇస్తారు?' అన్నాడు గాని, నిజంగా అలా అనిపిస్తుందా? ప్యాసే కాకపోతే తనకెంత అవమానం?

చివరికి 'నేనేంచేస్తాను; నా విధి నెరవేరుస్తాను. తర్వాత ఏమవుతేనాకేం?' అనుకున్నాడు.

ఆలోచనల్తో కాలం రెక్కలు కట్టుకుని పారిపోయింది.

సాయంత్రం రానేవచ్చింది; సుకుమార్ వాళ్లింటికి వెళ్ళనూ వెళ్ళాడు.

ముసలాయన చాలా ఆదరించి హాల్లోకితీసుకువెళ్లాడు.

అక్కడ చాలా కుర్చీలున్నాయి. కిటికీలకు ద్వారాలకూ అద్దకం వెయ్యబడిన వాయిల్ తెరలు కట్టబడ్డాయి. గోడలని రకరకాల కాలండర్లు అలంకరించి వున్నాయి. సుకుమార్కు ఆ యింటిసీ, ఆ నవనాగరికపు ఏర్పాటుల్నీ చూడగానే వొళ్లు పులకరించింది.

"అదృష్టవంతులు" అనుకున్నాడు ఆశ్చర్యంగా, కళ్ళని పెద్దవిచేసుకు చూస్తో. ఫలహారం చేస్తున్నంతసేపూ, ముసలాయన— సుకుమార్ తనకోరికను మన్నించినందుకు సంతోషించినట్టున్నాడు మనసులో— అదేపనిగా అతన్ని పొగడసాగాడు.

"మీ సంగతి మావాళ్లకు కూడా చెప్పాను. వాళ్లెంతో ఆనందించారు. మా అమ్మాయి చదువుకుంటే మీదగ్గరే

చదవాలన్నారు!" అన్నాడు నవ్వుతూ.

సుకుమార్ టీ తాగడం పూర్తి చేసి, చేరుమాలుతో మూతి తుడుచుకున్నాడు.

తమలపాకు లిచ్చిన తర్వాత ఆ వృద్ధుడు "భారతీ, భారతీ! పుస్తకాలు తీసుకొని, రా అమ్మా" అని కేకేశాడు.

"వస్తున్నా, నాన్నా!" అంది సన్నని ఓ కంఠం లోపలి నుండి.

కంఠం తియ్యగానే వున్నట్లనిపించింది, అతనికి. అతను సస్పెన్సు భరించలేకపోయేడు. త్వరగా వొస్తే బాగుండునను కున్నాడు.

మరుక్షణంలో చాలా అందంగా, నాజూగ్గా, సన్నగా, పొడుగ్గా వుండి, లేతపసుపు పచ్చని చీరతో శరీరాన్నంతని కప్పుకుని, పుస్తకాలతో వొచ్చిన భారతి అతని హృదయాన్ని రంజింప చేసింది.

భారతి టేబిల్ పై పుస్తకాలుంచి ఎదురుకుర్చీమీద తల వొంచుకొని కూర్చుంది.

ముసలాయన బయట గుమ్మందగ్గర, బయటగా కుర్చీ వేసుకున్నాడు.

"ఏం బిడియపడక పంతులుగారు చెప్పిందంతా బాగా నేర్చుకో. అన్నిటికీ సరిగా సమాధానం చెబుతూండు" అని చెప్పి, కుర్చీలో శరీరాన్ని చేర్చి, దినపత్రికా పఠనంలో నిమగ్నుడయ్యాడు.

"నువ్వు ఏయే సబ్జెక్టుల్లో వీక్ గా ఉన్నావు?" అన్నాడు సుకుమార్.

"ఇంగ్లీష్, సైన్సు, లెక్కలు" అంది భారతి.

ఇంగ్లీషు పుస్తకం తీసుకొని కొంత డిక్టేషనూ, ఒకటి రెండు ప్రశ్నలూ, ఒక లెక్కా, సైన్సులో కొన్ని ప్రశ్నలూ ఇచ్చాడు. భారతి తోచిన జవాబులు తల ఎత్తకండానే రాసింది. తప్పులు ఎక్కువ లేవు.

సుకుమార్ కు ఆ సుకుమారికి చదువుచెప్పడం సులువే ననిపించింది.

అతని బడిలో విద్యార్థులు అతని మనోపథంలో మెరిశారు. ప్రతీ క్లాసుకీ పదిపదిహేనుమందిని తప్పిస్తే, చదువు మీద శ్రద్ధవున్నవాళ్ళే కనపడరు. అంతకంటె ఈ అమ్మాయి స్టాండర్డు చాలా బాగున్నట్లనిపించింది.

టెస్టు చెయ్యడం అయ్యాక, "ఈ వేళకి చాలు" అని లేచాడు. భారతి కూడా లేచింది.

ముసలాయన "ఏం పరీక్ష చేశారా?" అన్నాడు, అతన్ని కూచోమంటూనే.

"ఆఁ! ఫరవాలేదండీ. మరి శ్రమపడి చెబుతాను. మీ అమ్మాయికూడా కష్టపడిచదవాలి. ఆపైన దేవుడిదే భారం" అన్నాడు సుకుమార్ దేవుణ్ణి ముందుగానే, రాబోయే ఫలితానికి అడ్డుగా పెట్టుకోవడం ఎందుకైనా మంచిదనుకుని.

"అంతేలెండి. నేడే ప్రారంభం అనుకోండి— ఈ వేళ మంచిరోజుకూడా! మీకు వీలున్నప్పుడు వచ్చి, చెప్పి వెడుతూండండి" అన్నాడు.

సుకుమార్ సెలవు తీసుకున్నాడు.

ఇంటికివొచ్చాడన్నమాటేగాని అతనిమనసు మనసులో

లేదు. తీయని ఆలోచనల్తో మెదడు ఆనందపరవశ మవ సాగింది.

భారతి! పేరు ఎంత చక్కగావుంది?

పైరివేటు చెప్పడమంటే – అన్నాభావ్యా ఆముదం తాగ డంతో సమాన మనుకున్న అతనికి ఏమీ కష్టమనిపించలేదు.

'సంస్కారంగల కుటుంబం' అనుకోసాగాడు; 'ఇంకా మూడు నెల్లు గడవాలి! అప్పుడే వెర్రి మొర్రి ఆలోచనలకి పోతే ఎలాగ?'

అన్నిటికంటె ఆశ్చర్యం కలిగించిన దతనికి, ఎదురుగా కిటికీ తెరమాటున 'సిలూయెట్'లా కదలినవ్యక్తి! ఎవరబ్బా? మధ్యమధ్య ముసిముసినవ్వులూ, నిట్టూర్పులుకూడా వినపడేవి.

తనమీద నిఘా కాదుకద! నిఘాఐతే నవ్వులెందుకు?

రకరకాల ఆలోచనలు – అవి అంతులేనివి.

హోటలు కెళ్ళేటప్పటికి ఎనిమిదిన్నరై, చల్లని అన్నం సాక్షాత్కరించినా అతను గమనించనేలేదు.

మసాలా పాన్‌బిడా వేసి, సిగరెట్ ముట్టించి ఇంటికి చేరాడు.

## 3

రోజులు గడవసాగాయి. చదువూ ముందడుగు వేస్తోనేవుంది.

మేష్టర్‌గా భారతిమీద కొంత అధికార స్వరం ఉప యోగించసాగాడు.

అప్పుడప్పుడు ఇంగ్లీషులో తప్పులుపోయినా, లెక్కలు రాకపోయినా, సైన్సులో పటాలు దించడం చేతకాకపోయినా

నవ్వించడం, ఏడ్పించడం మొదలైనవి మొదలెట్టాడు.

భారతి చాల గడుసు ఘటం! ఎప్పుడూ తలెత్తయినా చూసేదికాదు; చూసినా చూసినట్టుకనపడేదికాదు; అందులో అతను గమనించేలా అసలే చూడడంలేదు.

అది తెల్సుకున్న అతను ఏ గోడవైపో, ఎదటి బాదం చెట్టువైపో చూస్తో పాఠాలు చెప్పేవాడు; 'నేలవైపు కాదు పుస్తకాన్ని చూడు' అని మందలించేవాడు; ఏదోవిధంగా భారతి దృక్కుల్ని ఆకర్షించాలని ప్రయత్నించేవాడు.

♦ ♦ ♦

ఓరోజున లెక్కలురాక భారతి బాధపడుతుంటే కేకలేశాడు. కిటికీ తెరమాటున ఫక్కున నవ్వు వినవచ్చింది. ఓమారు మొహం తెరపైన కన్పడింది.

అతను ఆనందం పట్టలేకపోయాడు. తన హృదయానికి గేలం వేస్తున్నది ఒకరుకాదు; ఇద్దరూ.

భారతి లోపలికి వెళ్లి తల్లితో ఫిర్యాదుచేసినట్టుంది. ఆ కిటికీ దగ్గర నీడ నవ్వుమానింది.

♦ ♦ ♦

తను నెళ్ళాళ్ళుగా పాఠాలు చెబుతున్నా భారతిలో చలనం లేకపోవడంచూసి 'శీతహృదయం గావును' అనుకున్నాడు.

కాని ఆవేళ బాటనీలో తెలియని పాఠమేదైనాఅడుగు అంటే పుష్పము పాఠము తీసింది.

ఆ పాఠం మగవిద్యార్థులకి చెప్పడానికే వింతగా వుంటుంది. ఇంక తనేమి చెప్పగలడు?

ఐతేనేం? చదువు తప్పుతుందా? నిర్భయంగా పుష్పం గురించిన అంశాలన్నీ చెప్పుకు పోయాడు.

ఆ ముసలాయన బయట కుర్చీలోనే వున్నా జంక లేదు. రెండు రోజుల తర్వాత ఎక్కడో కాఫీ తాగుతుంటే అతనికి గుర్తుకు వచ్చింది- నిజంగా పాఠం అర్థంకాక కాదు; తననోటి ద్వారా విందామని అడిగిందేమోనని.

అప్పుడప్పుడు తన స్వంత పుస్తకాలు కొన్ని చదువుకోడాని కిచ్చేవాడు. మళ్ళీ తిరిగివచ్చేటప్పుడు చక్కని న్యూస్ పేపర్ అట్టలతో తిరిగివచ్చేవి.

ఒకసారి అడిగాడు:

"ఇవన్నీ ఎవరేశారు?"

"మా అక్కయ్య"

"ఆవిడ ఎంతవరకు చదువుకున్నారు?"

"హెచ్. యస్. సి. పాసైంది."

ఆతనడుగుతే సమాధానాలు బాగానే చెప్పేది. కాని ఏమడుగుతాడు- పాఠాల్ని విడిచి? ఏమన్నా మాట్లాడాలని వుండేది. పాఠాల ప్రశ్న లడిగితే నోటెని చెప్పేదికాదు- రాసిచూపించేది. అదీగాక ముందూ, వెనకా ఇద్దరు సెంట్రీలైరి!

ఆ వేళ తాను భారతికిచ్చిన ఇంగ్లీషు స్టోరీ పోయమ్సు పుస్తకాన్ని తీసుకువెళ్ళాడు. దానికూడా అట్ట అమర్చి వుంది. చాలా సంతోషించాడు.

దానిమీద 'భారతి' అని రాసివుంది. స్కూల్లో టీచర్లుచూస్తే బాగుండదని కవరు తీసేశాడు? దానిలోనుండి

ఓ చీటి కింద పడింది దాన్ని తీశాడు.

"నన్ను గురించి మా చెల్లినెందుకు అడగడం?

అహల్య"

అని వుంది.

భారతి అక్కయ్య అహల్యా? ఎంత అందమైన పేరు! పేరేకాకండా అహల్యమీద అతని కమితమైన ప్రేమ-ఎందుకంటే భర్త రాయైపొమ్మని శపిస్తే ఏం గాక - ప్రేమవిలువని గ్రహించిన ప్రేమమూర్తి!

ఇది బాగుందనుకొని తానూ సమాధానానికి పుస్తకపు అట్టని పోస్టుమానుగా వాడసాగాడు.

మరో నెల గడిచేటప్పటికి ఉత్తరాలపోగు తయారైంది-ప్రేమలేఖలు!

పాపం భారతికివేం తెలీవు! తెలిస్తే కథా గమనానికి అడ్డుతగిలేదేమో?

క్రమంగా సుకుమార్‌కి భారతిమీద ఆకర్షణపోయింది. తెర వెనకాల, నీలి నీడపైనే అతనిదృష్టి. ఆముసిముసినవ్వుల్లో కోకిల నినదాన్ని వినేవాడు; ఆ నిట్టూర్పు శబ్దాల్లో విరహవేదన వినేవాడు.

తరచు ఏదో వంకని అతనికి కనపడసాగింది అహల్య; పెన్‌ఫ్రెండ్‌షిప్ అధిక మయ్యాక.

అతను చిరునవ్వు విసిరేవాడు. అహల్య చూపులో గ్రహించేది.

ఈ గొడవల్లో బడిలో పదిసార్లు చేసిన లెక్కలైనా ఆన్సర్లు కలిసేవికావు. భారతి 'మేష్టరుకే లెక్కలురావు'

అని ఎక్కడ అనుకుంటుందోనని భయపడేవాడు. తిరిగి మన స్సుని కేంద్రీకరించి అరగంట కష్టపడితేనేగాని ఆ లెక్కలు వొచ్చి యేడిచేవి కావు.

4

ఒకరోజున వర్షం జోరుగా వొచ్చి పాకాన్ని చెదర కొట్టింది.

ముసలాయన లోపలికి వొచ్చాడు. బాతాఖానీలో పెళ్ళిళ్ళ సమస్యలూ నేటి యువకుల సంకుచితత్వంబుద్ధులూ; తమ విలువని తెల్సుకోకుండా ఆంధ్ర దేశపు తల్లిదండ్రుల్ని పీడించాలని చూసేవారి నైజమూ, అన్నీ ఆ ముసలాయన లెక్చరులో దొర్లేయి!

సుకుమార్ ఆయనకు ఆత్మసంతృప్తి కలిగేలా "అవు నండి, నిజమే. నేటి నవయువకులు అభ్యుదయం అంటూ, భుజాలెగరేస్తూ, వెనక్కి అడుగేస్తున్నారు" అన్నాడు.

తర్వాత ఆయన తన బాధంతా వెళ్లడించాడు: నాలు గైదు వేలు కట్నమిస్తామన్నా మంచి సంబంధాలు కుదరడం లేదనీ, అంతా.

సుకుమార్ 'ఊఁ!' కొట్టి వూరుకున్నాడు 'నువ్వు చేసు కుంటావా?!' అని ఆయనా అడగలేదు; 'నావంటి వాళ్ళు మీకు కనపడరేం?' అని ఇతనూ అనలేదు.

మనస్సులో మాత్రం అనుకున్నాడు: అహల్య తన హృదయాధి దేవతైతే బాగుండునని. కాని తనంత తను వెళ్ళి ఎలా అడుగుతాడు? మగాడు? పౌరుషం అడ్డు తగిలింది.

"ప్రయత్నం చెయ్యండి — మీకు దొరక్క పోవడ

మేమిటి యత్నిస్తే!" అన్నాడు ఉపసంహారంగా.

## 5

ఒకనాటి రాత్రి.........

నక్షత్రాలు నవ్వలేదు, ఆకాశం పూల వర్షం కురిపించ లేదు; ఖగోళాలు ప్రేమ సంగీతాన్ని ప్రసరించలేదు; చంద్రుడు నవ్వుతో తన సహస్ర హస్తాలతో భూదేవికి కితకితలు పెట్టలేదు.

ఐనా ఎందుకో సుకుమార్‌కు తీరని సంతోషం కలుగ సాగింది. పైవన్నీ జరిగినట్టే అనిపించింది.

మేఘాల్లో తేలుతూ, ఏ గంధర్వ లోకంలోకో పోతు న్నట్టు అనుకోసాగాడు. తనలో తనే నవ్వుకోసాగాడు.

అర్ధశేరు మిఠాయికొని మిత్రులందరికీ పంచి పెట్టాడు. ఏమిటీ కారణం?

— ఏమీ లేదు.

" రేపురాత్రి ప్రభాత్ హాలువద్ద మొదటి ఆట అనంత రం కలవండి.

ఎక్కడికన్నా పోదాం. మీరు మీ లేఖలో రాసినట్టు నాకూ మీ ప్రేమ కావాలి. అన్యమైన కోరికేదీ లేదు.

ఇదే ఆఖరి సందేశం

మీ అహల్య"

లెక్కల పుస్తకం అట్టలోంచి బయట పడింది, ఈ లేఖ ప్రేమ లేఖల పర్యవసానమిది

సుకుమార్ ఆతురతతో స్త్రీల గేటు దగ్గర వెతుకు తున్నాడు. సినిమా వొదిలాక భార్యల సంరక్షణ దీక్షాపర తంత్రులైన భర్తలూ, తక్కిన స్త్రీల చుట్టపక్కాలూ అక్కడ

చేరారు.

రిక్షా టాంగావాలాల గోల మధ్య వుండనే వుంది.

"ఇటురండి" సన్నని గొంతుతో సుకుమార్‌ని పిలిచింది, అహల్య. అతను అనుసరించాడు.

జనాన్ని దాటాక "స్టేషన్‌కు పోదాం" అన్నాడు.

"సరే" అని తలూపింది అహల్య. ఇద్దరూ నడుచుకుని స్టేషన్‌కు వెళ్లారు. సుకుమార్ "రైలు టైం ఇంకా ఎంతవుం" దని అడిగాడు.

"రెండు గంటలు" అన్నాడు నిశాచరుడైన గుమాస్తా.

పొడుగాటి ప్లాట్ ఫారంపైన మూలగా చీకటిలోనున్న సిమెంట్ బెంచీవైపు వెళ్ళి కూచున్నారు ఇద్దరూ.

ఆ నక్షత్రాల వెలుగులో, పరోక్షంగా స్టేషన్ నుండి వచ్చి పడుతున్న దీపపు కాంతిలో ఇద్దరూ అనిర్వచనీయమైన ప్రేమ భావంలో మునిగి తన్మయత్వం పొందసాగారు.

తన చేతిలోనికి అహల్య వేళ్ళని తీసుకున్నాడు. నిప్పు కణికల్లా వుండి బెండకాయలనిపోలిన వేళ్లు అతనికి వెచ్చదనాన్ని కలిగించడమే కాకుండా, శరీరంలోనికి విద్యుత్తును పంపినట్టుకూడా అనుకున్నాడు.

చలిగాలికి ఆగలేక చీరకొంగుతో తలకప్పుకుని, తక్కిన దాన్ని కండువాలా కప్పుకుంది, అహల్య.

వాళ్లు పరస్పరం చూసుకోవడం తప్ప మాటలేమీ జరగడంలేదు; ఎవరు ఏ విషయాన్ని ఎలా మొదలెట్టాలో! అనేది తేలనే లేదు.

భవిష్యత్ కార్యక్రమమంతా ఆనాటి లేఖలో నే

వ్రాశాడు సుకుమార్. మర్నాటికి హైదరాబాద్ చేరాలి. అక్కడ అతని మిత్రులూ, బంధువులూ చాలా మంది వున్నారు. వాళ్లు ఎలాగా అతనికి సహాయం చేస్తారు. అక్కడివాళ్ల సహాయంతోనే పెళ్లిఏర్పాటు........

"ఏం భయంగావుందా?"

"భయమెందుకు?"

"ఒంటరిగా పరాయి......"

"ప్రియుడు పరాయివాడెందు కౌతాడు?"

"ఎంత నమ్మకం!"

"అవును; ఆడవాళ్ల బతుకే అంత!"

"ఎంత?"

"నమ్మి ప్రేమించిన వాడికోసం సర్వం త్యాగం చేసేంత—అంతే; అంతకంటె గత్యంతరం ఏముంది?"

"నిజమే—పురుషులకంటె స్త్రీ లేగొప్ప ప్రేమికులేమో అనుకుంటాను"

"స్త్రీలూ అలాగే అనుకుంటారు"

"ఏమని?"

"పురుషులు గొప్ప ప్రేమికులని!"

"ఈ విషయం మీ నాన్నకి తెలుస్తే?"

"భయంలేదు"

"ఎందుకని?"

"ఆయనకో రేది నా వివాహమే కనక. పైపెచ్చు సంతోషిస్తారు?

"నాకు నమ్మకంలేదు"

అహల్య దగ్గరగా జరిగాడు, ఒక చెయ్యి ఆవిడ నడుం చుట్టూ పోనిస్తూ—అహల్య వొంటిచేతి కౌగిట్లోనే ఇరుక్కుంది.

అహల్య దగ్గరకు జరిగింది ఇద్దరూ జీవితంలో తొలి సారిగా కొత్త అనుభూతులు పొందుతున్నట్టున్నారు — మైమరవ సాగారు.

"చలి వేస్తోందా?"

"లేదు"

"ఏమో; మీరసలే సుకుమారులు కూడాను" సుకుమార్ నవ్వేడు! అహల్య ముత్యాల పల్వరస చీకట్లో మెరిసింది.

రైలు స్టార్టైనట్టుంది; మొదటిగంట మోగింది. దీపాలు వెలిగించారు! జనం హడావుడి, పోర్టర్ల గోలా తిరిగి విజృంభింప సాగేయి

"మీ వుద్యోగానికేమన్నా......?"

"ఏం భయం లేదు. నెల్లాళ్ళు సెలవు పెడితే వాళ్లే ట్రాన్స్‌ఫర్ చేస్తారు—మరోచోటికి"

అహల్యతో చెప్పి వెళ్లి సుకుమార్ రెండు టికట్లు తీసుకున్నాడు.

రైలు సైట్ కాగానే రెండో గంట మోగింది.

రైలు ప్లాట్ ఫారంవద్ద ఆగింది. జనమంతా దిగసాగారు; అంతకంటె ఎక్కేవాళ్ళ తొందర మరీని.

అహల్యా సుకుమారులు ఇంటర్ క్లాసు పెట్టెవద్దకు వెళ్లారు. అక్కడెవరో ఆఫీసరు సామాన్లు దిగుతుండడంవల్ల మూడు నిమిషాలు వాళ్లు నుంచోవల్సి వచ్చింది.

చివరికి రైలు ఎక్కబోయారు. "ఆగండి!" అనే కేకలు వినపడ్డాయి.

సుకుమార్ ఆశ్చర్యపోయాడు! ఎవరు చెప్మా? పోలీసు కాదు గద!

ఆ ముసలాయన వగర్చుకుంటూ వచ్చాడు.

సుకుమార్‌కు ఏం చెయ్యాలో తోచలేదు. తల తీసి నట్టయింది. శరీరం భూమిలోకి చొచ్చుకు పోతుందేమో అను కున్నాడు. ప్రయత్నమంతా గంగకలిసినందుకుమండిపోసాగాడు.

"రండి బయట టాక్సీ వుంది" అన్నారు ఆ ముస లాయన.

"పదండి" అంది అహల్య.

సుకుమార్ అనుసరించక తప్పలేదు. కారులో ఆయన అన్నాడు: "ఈ మాత్రం దానికి ఇంత ఆర్భాట మెందుకు? నా కుమార్తె పెళ్లి సమస్య తీరింది! నన్నడుగుతే నేనే పెళ్లి ఏర్పాట్లు చేసివాణ్ణిగా."

సుకుమార్ ఏదో పరాభవం జరుగుతుం దనుకున్నాడు. కాని కథ అడ్డం తిరిగినా, మలుపు మంచికే వస్తున్నందుకు తనలోనే సంతోషించాడు.

వెధవ సెలవు! వెళ్లాళ్ళు అనవసరంగా జీతం లేకుండా పెట్టాల్సివచ్చును.

## 6

పెళ్లియిన కొన్నాళ్లకి అహల్యని అడిగాడు.

"మన ప్రేమకలాపం సంగతి మీ నాన్నకి తెల్సా!"

"ఆఁ!"

"మనం పారిపోదామనుకున్నది?"

"ఆc!"

"మరెందుకు ఊరుకున్నారు?"

"అందుకనే"

"అంటే"

"మన పెళ్ళి కావాలని. మా నాన్న గొప్ప దూరదృష్టి కలవారు. అసలు పై్ర వేటు ఏర్పర్చిందికూడా నా పెళ్లిని గురించే"

"అదెట్లా?"

"ఎట్లాఅంటే మనుషులకు ఎదటి వస్తువులపై ఆకర్షణ ఉండదు; దూరపు కొండలు నునుపుగా, నీలంగా వుంటాయని భ్రమపడి మోజు పడతారు అని మా నాన్న నమ్మకం. దీన్ని నిరూపించడానికే ఈ విధంగా చేశారు"

కిలకిలా నవ్వసాగింది.

"ఇంకా......"అన్నాడు.

"అదీగాక మామూలుగా పెళ్ళి చూపులకు పిలుస్తే నిచ్చెనెక్కుతున్నారు యువకులు. ప్రేమలోపడేలాచేస్తే కట్నం భ్రమ పోతుందని మా నాన్న ఎత్తు ఎత్తారు" అంది.

"అయితే నీకెలా కలిగింది, ప్రేమ"

"మీ సుకుమారత్వాన్ని చూసి!"

సుకుమార్ అలాగే కర్చీలో చతికిలబడి 'సాహస కార్యం చెయ్యబోయి సాలెగూట్లో చిక్కడ లేదుకదా!' అనుకున్నాడు.

★

# వేసవి పగలు

ప్లీడరుగారి యింటిదగ్గర్నించి తిరిగొచ్చిన సీతయ్య కర్రపెట్టెని గబగబా తెరిచి, అందులో బట్టల్ని చిందరవందరగా విసిరేసి, అడుగున ఉన్న చిన్న తాటాకు పెట్టెని తీశాడు. కూతురు రామి దీపంబుడ్డి పట్టుకుని నుంచుని, అంతా అర్థం కాకుండా చూస్తోంది

తాటాకు పెట్టెలో చిల్లరంతా లెక్కపెడితే ఆరు రూపాయలు తేలింది.

"ఇప్పుడెందుకు ఆ డబ్బు?"

కూతురడిగింది. రూపాయలవైపు శూన్య దృష్టుల్ని ప్రసరిస్తున్న సీతయ్యకి ఆ ప్రశ్న బాహ్య ప్రపంచపు స్ఫురణ కలిగించింది.

"ఎందుకా? ఆయనకి కిందటి నెల బాకీ బాపతు డబ్బు తక్షణం యివ్వాలిట! లేకపోతే రేపట్నించి రిక్షా కిరాయి కిచ్చేది లేదన్నాడు."

బుడ్డికింద పెట్టి రామి పక్కగా కూచుంది.

"పోనీ వేసవికాలం వెళ్ళాక తీర్చుకుంటామని చెప్పకూడదూ?"

"అంతా అయింది. కాని అ మహానుభావుడు వినేలా లేడు. అందుకే అరగంటసేపు ఏకధాటిగా లెక్చరుకొట్టేంది; నన్ను పిలిపించిందీని".

సీతయ్య చేతులకండల్ని నుముసుకోసాగాడు, అవి కష్టం

లో కరిగిపోయూయో, గట్టి పడ్డాయోనని.

"పోనీ సగమిచ్చెయ్యి. తలమీదికి గుడ్డా కాళ్ళకి చెప్పులూ లేకపోతే ఎండలో ఎట్లా బాధపడ్తావ్?"

ఆలోచన బాగానే వుంది. కాని సీతయ్య ప్రయత్నా లన్నీ నీళ్ళు కారాకనే, యింటికి వచ్చాడు.

"ఏదో పిచ్చిగాని, నేను ఆ ప్రియత్నం చెయ్య లేదను కున్నావా, అమ్మాయ్? కాని ఆ బ్రాహ్మడు అంగీకరిస్తేగా! ముందు ఆ బాకీ అక్కడపెట్టి, రేపు రిక్షామీద చెయ్యివెయ్యి అన్నాడు."

"మరి తలగుడ్డా, జోళ్ళ మాట?"

"ఆ సంగతి నే చూస్తాన్లే!"

బట్టలు మళ్ళీసర్ది, డబ్బు సంచిలో పెట్టుకుని, బయలు దేరాడు, సీతయ్య.

రామి మాత్రం నిస్సహాయత తెలియజేస్తున్న చూపు లతో అతన్ని సాగసంపింది.

దారిలో సీతయ్య అనుకున్నాడు:

"వీళ్ళకి కృతజ్ఞత వుండదు. మనుషుల్ని నమ్మలేరు, అసలు వాళ్లమీద వాళ్ళకే నమ్మకం తక్కువ. ఇంక యితరు ల్నెలా నమ్ముతారు? నేను కష్టాన్నైనా సహిస్తానుగాని, మాట పడలేను."

## 2

వేసవికాలం! అప్పుడే రోహిణీకార్తె ప్రవేశించింది.

సుకుమార శరీరులైన ధనికులుకూడా మహా కష్టపడు తున్నట్లు చెమటల్ని గక్కుతున్నారు.

కానీ యిళ్ళల్లో వాళ్ళకి తగినసదుపాయాలు లేకపోలేదు. ఎలక్ట్రిక్ ఫాన్లూ, వొట్టివేళ్ళ తెరలూ, ఇంటిలోకి ఎండని రానియ్యకుండా తరుము తున్నాయి. ప్రపంచమంతా అంత చల్లగానూ ఉన్నట్టు అనుకుంటున్నారు. పదింటికీ, పన్నెండింటికీ, మూడింటికీ వచ్చి నీళ్ళతో కుర్రాడు వట్టివేళ్ల తెరల్ని తడపకుండావుండడు. ఇది అదృష్ట జీవుల సంగతి మాత్రమే!

కాని కోట్లాది దురదృష్ట జీవులు లోకంలో లేకపోలేదు. ఎండవానల్ని భరించమని దేవుడు సృష్టించాడు వాళ్లని. అదే అతడి వుద్యోగం. కాని యింత కష్టపడ్డా మామూలు రోజుల్లో ప్రతిఫలం కంటె ఒక అణా అధికమివ్వడానికి, ఆ అదృష్ట జీవులు గుడ్లు మిటకరిస్తాయి. పర్సులమీదికి చేతుల్ని పోనివ్వావు.

మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. పొద్దున్ననించి ఏదో కష్టపడి రిక్షా లాగాడుగాని యింక దాన్ని ముట్టుకోడం కష్టమనిపించింది సీతయ్యకి. కాని ఎంతగా ఎండకి అలవాటు పరుద్దామనుకున్నా, మొద్దుబారుద్దామనుకున్నా, ఇంకా ఎండ ఆ మోటుతనాన్ని చీల్చుకుని మంట పెడుతోంది.

సూర్యరశ్మి తల్లోకి చొచ్చుకుపోయి మెదడును కరిగిస్తున్నట్టుంది. వొళ్ళూ, కట్టుకున్న చిన్నిగుడ్డాకూడా చెమటతో తడిసిపోతున్నాయి. ఎంతగా చెమటని తుడుచుకున్నా మళ్ళీ, అంతంలేని ప్రవాహంలా అది పైకి వుబికి వస్తోంది.

అప్పుడే స్టేషనునించి ఒక సవారీని ఇంటి దగ్గర దిగబెట్టిన సీతయ్య ఒక్కసారిగా ఏదో పెద్ద ఒగర్పునీ, ఆయాసాన్నీ పొందాడు. తలలో శూలాల్తో పొడుస్తున్నట్టు పోటు

కలగసాగింది. గుండె వేగంకూడా అధికమైనట్టను కున్నాడు. ఎదట చూస్తున్న వస్తువులు ఎవో నీటిలో వస్తువుల్లా వంకర టింకరగా వున్నట్టు కనపడ సాగాయి. చేతులు రిక్షాగంటని అనవసరంగా, అనాలోచితంగా ఒకసారి వాయించాయి.

పక్కనే వున్న మర్రిచెట్టుకిందికి కాలుతున్న కాళ్ళు అనుకోకుండానే పోయాయి. రోడ్డుకి పక్కగా రిక్షాని నిలిపి, చెట్టు దగ్గర కూచున్నాడు, ఒక నిమిషం విశ్రాంతికని. ప్రాణం లేని రిక్షా కూడా సానుభూతి పూర్వకమైన విచారాన్ని తెలుపుతున్నట్టనిపించింది, అతనికి.

'ఒక్క నిమిషం నువ్వు కూడా విశ్రాంతి తీసుకో. ఎండలో నీ టైర్లు కరుగుతున్నాయి కూడాను' అన్నాడు.

అప్పుడే వీచిన గాడ్పు గాలి చెట్టుకింద కొంచెం చల్లబడి అతని ఆవలింతలో మిళితమై పోయింది. అతని ఆయాసం కూడా కొంత తగ్గ సాగింది. నడుం దానంతటదే చెట్టుకి జారగిల బడింది. ఎండవేడికి ఎర్రబడ్డ కళ్ళు రెప్పల వెనకాల దాగుతున్నాయి

ఒక్కనిమిషంలో అతన్ని గాఢమైన నిద్ర ఆక్రమించు కుంది. మర్నాటి తిండి సంగతీ, యజమానికివ్వాల్సిన అద్దె సంగతీ ఏమీ అతన్ని బాధించేవిగా లేవు.

అల్లా ఎంతసేపు నిద్రపోయాడో అతనికే తెలియదు.

## 3

బాగా చీకటి పడింది నాన్నకోసం ఎదురు చూసిన రాము కంగారు పడసాగింది మధ్యాహ్నం గంజికి కూడా రాలేదేమా అనుకుంది.

వెతుక్కుంటూ, వెతుక్కుంటూ చివరికి ఈ చెట్టు నీడని చేరుకుంది.

తండ్రి ఇంకా వొళ్ళు తెలియని నిద్రలోనే వున్నాడు. తన జన్మలో జ్ఞానం వచ్చాక నిద్దర పోవడం, అంత సంతుష్టి కరంగా, అతనికి అదే మొదటిసారిగావును.

రోడ్డు పక్కగా వున్న రిక్షా చక్రం రోడ్డుపై విరిగి పడివుంది. రామికి కంగారెత్తింది.

ఏం జరిగింది? తండ్రేమయ్యాడు? ఏ ప్రమాదం రాలేదు కదా, కొంపతీసి?

ఎన్నో చెడ్డ ఆలోచనలు, లెక్కలేనన్ని త ల లో ప్రవేశించాయి.

కాని తండ్రి పడుతున్న గురక కొంచెం కంగారును పారద్రోలింది. కాని విరిగిన రిక్షా ఆమెన్ని అ ధి క ం చేస్తోనే వుంది.

"లే, నాన్నా, ఇక్కడ నిద్దరేమిటి? ఈ రిక్షా ఇలా అయిందేమిటి?"

తట్టి లేపసాగింది.

సీతయ్య కళ్ళు తెరచాడు ఒక నిమిషం ప్రపంచా న్నంతా కలియ జూశాడు, ఎదో ఏ లోకంలోనించో అప్పుడే దిగినవాడిలా. తర్వాత అన్నాడు:

"ఎవరూ...? నువ్వా!!" లేచి నుంచున్నాడు. రామి మళ్లీ అంది.

"ఈ నిద్ర రేమిటి? ఈ రిక్షా కేమిటి ఇలా అయింది.'

సీతయ్యకి అంతా అర్థమయింది.

తను సిద్ధస్లో వున్న సమయంలో ఏలారీ అయినా ఢీకొట్టని వుంటుంది. కాని అతనికి విచారం కలగలేదు.

"పోనిలే .. ఇంక ఎండలో రిక్షా లాగక్కర్లేదు. ఏ పల్లెటూరన్నా పోయి కూలిపని చేసుకుంటాను."

అమితమైన సంతోషంతో అన్నాడు!

కాని రాము యింకా అంటోంది:

"మరి అప్పవాడిసంగతి? వాళ్ళకి రిక్షా ఇయ్యవద్దు!"అని.

కాని సీతయ్యకి ఆ మాటలు వినిపించడం లేదు. ★

## "చరిత్ర పునరావృత్త మవదు!"

కేశవరావు ఎంత చెప్పినా వినలేదు. వినడు. కారణ మేమిటా అని ఎంత ఆలోచించినా తెగటం లేదు. పోనీ నేను నమ్మేదాంట్లో లోపాలేమైనా వున్నాయేమోనని తరిచి తరిచి చూసుకున్నాను. కాని అటువంటిదేమీ జరగలేదు.

నా దృఢమైన నమ్మకం ఏమిటంటే- చరిత్ర పునరావృతం కాదని. నేను చదివిన సిద్ధాంతాలు దాన్ని బలపర్చేవి.

"చాలా మంది చరిత్ర ఏదో వృత్తం లోపలే తిరుగుతుందనుకుంటారు. పాత రోజులు మళ్ళీ వొస్తాయని నమ్ముతారు. కాని అది అబద్ధం. చరిత్ర పునరావృత మవదు. ఒక స్పైరల్ లోవలె మెలికలు తిరిగి వున్నత పథాలకి చరిత్ర తగు గమనం సాగిస్తుంది" అనేది నా వాదన.

"కాదు. చరిత్ర పునరావృతి మౌతుంది. మనం పాత రాతి యుగానికి ఏనాడో పోక తప్పదు" అని అతను మరింత

బలంగా వాదించే వాడు. ఆ మాటలు చెప్పేటప్పుడు కళ్లలో ఒక విధమైన వెలుగు, నేను మొదట అర్థం చేసుకోలేక పోయినది, కన్పించేది. అతి గాంభీర్యంగా మాట్లాడేవాడు.

నా వాదనని బలపర్చుకునేందుకు మనం ప్రిమిటివ్ సామ్యవాద స్థితి మొదలుకొని, భూస్వామ్య పెట్టుబడిదారి వర్గ స్థితికి, సామ్రాజ్యవాద దశనించి సోషలిజం వైపు ఎట్లా నడుస్తున్నామో నిరూపణలతో చెప్పేవాడ్ని.

పురాతన కాలంనాటి స్థితిగతులకి సంఘాన్ని, దేశాన్ని నడుపుదామనుకోవడం కూడా ఎట్లా భ్రమో తెలియపర్చేవాడ్ని.

అప్పటికి కొద్దిగా ప్రూరుకునే వాడు. మర్నాడు మళ్లీ యథాప్రకారంగా వాదించేవాడు.

ఒకరోజు సాయంత్రం పార్కులో బలవంతం చేసి తనకి గల నిరూపణల్ని చెప్ప మన్నాను.

"నేను నమ్ముతున్నాను, అంతే" అన్నాడు మొండిగా.

కాని చివరికి తక్కువ స్వరంలో మొదలుపెట్టి చెప్ప సాగాడు. నేనుకూడా అతని సీరియస్‌నెస్‌ని అర్థకంగా, శ్రద్ధగా వినడం మొదలు పెట్టాను.

"నేను అట్లా అనుకోవడానికి, నీ వాదనల్ని తలకెక్కించుకోలేకపోవడానికి గల కారణం ఒక్కటే. దానికి నా చరిత్రే ఆధారం."

గొంతుకలో జీర వస్తుంటే కంఠం సవరించుకున్నాడు.

"ఇరవయ్యో శతాబ్దంలో సగందాదాపు గడిచినా, ఇంకా కులభేదాలు సమయని భారత దేశంలో జన్మించినం

దుకు నేను పొందే బాధ చెప్పడానికి మాటలు చాలవు.

"నామాట అట్లావుంచు. మా నాన్న! ఆయన నాకు కొంతదారి సరి చేసినా నాకీదురవస్థ తప్పటంలేదు. ఆయ నెంత కష్టపడ్డాడో! పాపం! నాకు ఆ గాధ తల్చుకొన్నప్పుడల్లా మన స్సు తరుక్కుపోతుంటుంది."

ఇక్కడ కాసేపు ఆగి, మళ్లా అందుకున్నాడు:

"చిన్నప్పుడు ఆడుకునే పిల్లల్లో, చదువుకునే టప్పుడు హాస్టల్లో, పెళ్ళిచేసుకునే విషయంలో, తర్వాత జీవితంలో మా నాన్న అనుభవించిన బాధని అర్థం చేసుకోవడం మరో మనిషి తరం కాదనుకుంటాను. ఆయన ఒక్కొక్క సమయం లో కూచుని గంటలతరబడి లోలోపల కుమిలి దుఃఖించేవారు.

"ఆ దృశ్యాలు ఇప్పటికీ, ఎప్పటికీ మర్చిపోలేను. ఆయ న చేసిన పాపం తక్కువ కులంలో జన్మించడం. ఆయన యే విధంగానూ బాధ్యుడు కాని ఆయన పుట్టుకని గురించి రంపపు కోతకి బలి అవడం ఏమంత న్యాయం?

"ఇప్పుడు నా జీవితం అంతే! ఎవళ్ళో నీ వంటి వారు తప్ప అతి సున్నితమైన నా మనస్సుని నిర్దాక్షిణ్యంగా కష్టపెట్టేవాళ్ళు ఎంతమంది లేరని! అవును. ఇతరుల్ని పీడించ డం కొందరు మానవులు వింత ఆటగా భావిస్తారు; ఆనందిస్తా రు. కొందరికి అదే వృత్తికూడా. వాళ్ళజోలు మనకెందుకులే.

"ఇంతవరకూ జరిగిన నా జీవితపు పుటలు తిరగవేసి చూసుకుంటే మా నాన్న అనుభవించిన కష్టాల వంటి కష్టాల సంఘటనలతో కూడిన గాధలే కనిపిస్తాయి.

"ముఖ్యం పెళ్లి విషయం. ఎంత చదువుంటేనేం!

ఎంత విశాల హృదయుడవుతేనేం? తక్కిన ఉన్నత లక్షణాల కంటె కులం అధికతమమైంది... వాళ్ళకి!— లోకోద్ధారకుల్లా మాట్లాడుతారుమళ్ళా. అందుకే మనసులోనే కుళ్ళి, ఆశయాన్ని స్వహస్తంతోనే తుంచేసుకొని అజ్ఞాతపు జీవితాన్ని గడపడానికి సిద్ధమవ వల్సి వొచ్చింది మా నాన్న.

"మధ్య ఇన్నాళ్ళు జరిగినా నా స్థితి కూడా అదే దారిలో నడిచేలా వుంది. ఈ వున్నత కులస్థుల మనుకునే హృదయ శూన్యులు కొంచపర్చి నప్పుడు ఆత్మహత్య చేసుకుందామా అనిపిస్తుంది" అని ముగించాడు కేశవరావు...ఇది జరిగిన రెండేళ్లకే తను బి. ఎ. చదువుతున్నప్పుడు, తన్ని ప్రేమించిన బ్రాహ్మణుల అమ్మాయితో వివాహం జరిగి, తన నమ్మకాన్ని మార్చకపోతే, ఇంకా "చరిత్ర పునరావృత మౌతుం"దనే నమ్ముతూ వుంటును అతను.

అతని పెళ్ళికినే పంపిన సందేశం: "చరిత్ర పునరావృత మవదు" అని.

★

# కుమార సంభవమ్

"ఛా! ఇంకా మానలేదూ? నేను చెప్పానుగా. ఒక్క కుమార సంభవమైతే వాడి తిక్క అదే తిరుగుతుంది. దీనికి ఏడుపెందుకే? లే, వాడు చూస్తే బాగుండదు" అంది రత్నమ్మ గారు.

ఈ అనునయంతో శారదలేచి కళ్ళు తుడుచుకుంది. వంటింట్లోకి వెళ్ళి పీట వేసి వడ్డించ సాగింది. భర్త రామం వచ్చి

నిశ్శబ్దంగా కూచుని తినసాగాడు.

అసలు రోజూ రాత్రి 8 గంటలకే రత్తమ్మగారు ఫల హారం కానిచ్చి, తన పక్కమీదికి చేరేది. తర్వాత మేనల్లుడి భార్యతో ఏదో పిచ్చాపాటీ మాట్లాడుతూ సైమరచేది.

ఆ వేళ కూడా అల్లాగే పని పూర్తిచేసికొని వచ్చేటప్ప టికి, శారద తన గదిలోకి వెళ్ళింది. ఆవిడ ఎంత పిల్చినా రాలేదు. "ఇదేంచోద్యమమ్మా! ఎనిమిదైనా కాలేదు. అప్పుడే నిద్దరా?" అంటూ ఆగదిలోకి వెళ్ళింది రత్తమ్మగారు.

శారద వెక్కి వెక్కి దుఃఖించడాన్ని గమనించింది. ఎందుకో తెల్సుకోలేకపోయింది.

"ఇదేంపనే, తీరికూచుని?" అంది. ఆవిడ రాకను గమ నించి, ఆవిడ మాటల్ని విన్నాక, పొర్లి పొర్లి వస్తున్న శారద దుఃఖం యేడుపుగా మారిపోయింది.

"చూడండి, పిన్నిగారూ!" అంటూ ఆవిడ మీదపడి బేరుమంది శారద.

"ఏమిటే సంగతీ? అసలు విషయం చెప్పి మరీ గోడవ చెయ్యి" అంది రత్తమ్మగారు.

శారదకి నోటమాట రాలేదు. మనస్సెంతో బాధపడు తూ ఉంది. ఏ విధంగా చెప్పగలదు? సిగ్గనేది కూడా కొంత అడ్డు తగిలింది.

ఇంతకూ అసలు సంగతి ఏమంటే రామానికి శారద కూ పెళ్ళై నాలుగేళ్ళయింది. పెళ్ళయిన రెండేళ్ళ వరకూ రామం శారద నీడలా ఉండేవాడు. చూసిన వాళ్ళంతా ఇల్లాంటి ప్రేమికులు వున్నారా! అనుకునే వారు.

కాని... తర్వాత రెండేళ్లలోనే అతనిలో చెప్పలేనంత మార్పు వొచ్చింది. శారదతో మాట్లాడ్డం— ఏదో సాంసారిక విషయాల్లో తప్పిస్తే— అపురూపమై పోయింది. క్లబ్ అలవాటు చేసుకుని ఎక్కువ కాలాన్ని అక్కడే గడప సాగాడు. శారదకిదంతా అగమ్య గోచరమైంది. ఎందుకు తన భర్తలో యింత వ్యతిరేకభావ మొచ్చింది? మొదట ఏవైనా దురలవాట్లకు లోబడ్డాడేమో నశిపించింది శారదకు. కాని దాంట్లో నమ్మకం కుదరలేదు. కొన్నాళ్ళకన్నా నిజం బయటపడక పోతుందా? అనుకుంది. ఏమీ తెలియలేదు.

పోనీ తన ఆకర్షణలో ఏదైనా మార్పు వచ్చిందా అంటే అదీలేదు. చాలమంది భార్యలు— తను ఎరుగును— తమ భర్తలేకదా అని వాళ్లని ఆకర్షించడానికి ప్రయత్నించక కొత్తదనాన్ని నిలుపుకోక, వాళ్ల ప్రేమకి దూరం అవుతారు. తను అలా చెయ్యడం లేదే!

కాని కారణం, ఎంత ఆలోచించినా, కొరకబడలేదు.

"ఆయన నాతో ...... మాట్లాడ్డమే లేదు. నన్ను నిర్లక్ష్యం చేసి అసలు లెక్క లేనట్టు వుంటున్నారు." అని మాత్రం బలవంతాన అనగలిగింది; తక్కిన భావాలు దుఃఖ తరంగంలో కలిసిపోయాయి.

"ఓసి వెర్రిదానా! దీనికేనా అంత యేడుపు! ఛా! వాడల్లాంటివాడు కాదే?" అంది రత్నమ్మ.

మరింకెలాంటివాడు? ఈ నిర్లక్ష్యమంతా ఎందుకు? ఎన్నో ప్రశ్నలు శారదలో వుదయించాయి. దుఃఖం మాత్రం తగ్గలేదు. రత్నమ్మగారు "నే చెబుతాలే! ఏడవకు" అంటూ

ఓదార్చింది

"నీ వద్దతేం బాగులేదురా! రేపట్నించీ, ఆ క్లబ్‌లూ, గ్లబ్బులూ మానెయ్యి నీ ఈడు వాళ్లింతా ఇళ్లానే వుంటున్నారా? ఇల్లు, ఇల్లాలూ...ఇవేం చూసుకో నక్కర్లే?" నెమ్మదిగా అతను అన్నం తింటుంటే మందలించింది రత్తమ్మగారు, ఇంటికి పెద్దదిక్కు తనేనన్న స్వాతిశయంతో.

రామూకి కిదేం అర్థమవలేదు. ఓసారి భార్య కేసి చూశాడు, పరిశోధిస్తున్నట్టు. కాని శారద తీక్షణ ముఖంలో అతనికే కారణమూ కనపడలేదు.

"అల్లాగే అత్తయ్యా! కాని సాయంత్రం పూట ఏమీ తోచొద్దూ? అక్కడికిపోతే కాస్త నలుగురు మిత్రులూ కలుస్తారేమోనని" అన్నాడు గొణుగుతూనే.

రత్తమ్మ తృప్తిపడింది. కాని శారదకది నోటి చివరి మాటే ననిపించింది. తను ఎన్నోసార్లు ప్రాధేయ పడింది. కాని పడకగది వాగ్దానాలన్నీ—వ్యర్థమయ్యాయి. కాని మేనత్త మాట? ఏమో ఏమవుతుందో?

రామూన్ని మేనత్తే పెంచి, పెద్దచేసింది. అందుకని అతనికి ఆవిడమీద భక్తిగౌరవా లున్నాయి. లేకపోతే తల్లి తండ్రుల్ని చిన్నతనంలోనే పోగొట్టుకున్న రామూకి నిక్కు-దక్కు తాలేక పోవును. అందుని కృతజ్ఞతతో ఆవిడ మాటల్ని జవదాటకండా చేసేది.

రాత్రి గదిలో అడిగాడు: "అత్తయ్యతో ఏం చెప్పావ్?"

శారద "ఏమీ లేదు" అంది.

"సరేలే" అతనేం మాట్లాడలేదు.

రాముం పత్రికృతిని చదవడం, వ్రాయడం కష్టం. అతనలా ఎందుకున్నాడు అంటే మీరూ చెప్పలేక పోవచ్చును, యెంత పరిచయమున్నా. శారద మీద ప్రేమ పోయిందా అంటే మామూలు భార్యా భర్తల మధ్య వుండే ప్రేమ లేక పోలేదు. కాని ఆ నిర్లక్ష్యానికి కారణం అవగతం కాదు. మొదటి రోజుల్లో ఎప్పుడూ శారద సరసనే వుండేవాడు. రెండు మూడు సార్లుగా వును రత్నమ్మ వారించింది కూడా! అది అతను అప్పట్లో వినలేదు.

ప్రేమ పేరుతో ఆడవాళ్ళ వద్ద కూచోటుంకన్న ఎక్కువైన ఇతర జీవితపు విలువలు గ్రహించాడో ఏమో శారదతో కలిసికట్టుతనం తగ్గింది. ఈ మార్పు మాత్రం శారదని చాలా బాధించింది. ఓర్పు లేకుండా చేసింది.

రత్నమ్మగారు 'కుమార సంభవమైతే వాడి తిక్క అదే తిరుగుతుంది' అన్న మాటలు శారదకి మనశ్శాంతి కలిగించాయి.

అప్పటికి పెళ్ళై 4 ఏళ్ళు అయింది. ఇంతవరకూ లేని సంతానం ఇప్పుడు కలుగుతుందా? ఏమో? వెయ్యి దేవుళ్ళని ప్రార్థించింది— సంతనాన్ని ప్రసాదించమని!

పురుషుల్ని సంసారంతోనూ భార్యతోనూ శాశ్వతంగా బంధించి వుంచే గొప్ప సాధనం సంతానం.

శారద కోరిక ఫలించింది. కొద్ది రోజుల్లోనే నెల తప్పింది. మనస్సు కుదుటపడింది. తన భర్తని తన బిడ్డ సహాయంతో తిరిగి తన వాణ్ణిగా చేసుకోవచ్చు. ఎన్నో ఆశాసౌధా

ల్ని నిర్మించుకొంది.

ఒకరోజు రత్తమ్మగారు అంది. "ఒరేయ్! నేను మనుమడ్ని యెత్తుకో బోతున్నాను"

రామం ఆశ్చర్యంగా చూశాడు.

రాత్రి గదిలో "ఇన్నాళ్ళూ చెప్పలేదేం?" అన్నాడు.

శారద సిగ్గుగా నవ్వింది. మనస్సు సంతోషంతో నిండింది. భర్త యెంతో ప్రేమతో అడిగాడు. ఎన్నాళ్లకి ఇంతసాదరపూర్వక వాక్యాన్ని వింది? 'పిన్నిగారు' చెప్పింది నిజమే!

కుమారుడు కలిగేడు.

మూడో నెల్లో రామం బారసాల చేసుకుని అత్తారింటి నుంచి భార్యనీ, పుత్రుణ్ణీ తీసుకు వచ్చాడు. శారదకి తన జీవితంలో కష్టాలన్నీ గట్టెక్కినట్టనిపించింది. తనకి కావల్సింది తన భర్త ప్రేమ! అది ఇక ముందు పొందకుండా యెలా వుండగలదు?

ఆఫీసు టైంలో ఎలా వుంటాడో గాని రామం కొడుకుని విడిచి క్షణం వుండడం లేదు. శారద పని పాలివ్వడం మట్టుకు. అతని కాలక్షేపమంతా కొడుకుతోనే. జీతం రాగానే వాడికోసం యెన్నో రంగు రంగుల ఆటబొమ్మలు, అవీ తెచ్చేవాడు.

ఒకనాడు ఆఫీసర్ ఏదో అర్జంటుపని అని అంటగట్టాడు. ఇంటివద్ద చేద్దామని తీసుకొచ్చి, పిల్లవాడితో ఆటలతో మర్చిపోయాడు. మర్నాడు ఆఫీసర్ "మీరు 24 గంటలూ ప్రభుత్వ నౌకర్లు" అన్నాడట.

పదినెల్లు గడిచాయి. కొడుకు సాధనంగా భర్తని

ఇంట్లో కష్టసుఖో కలిగినందుకు సంతోషించింది శారద. రత్తమ్మగారు కూడా ఒకటి రెండుసార్లు గావును "నే చెప్పలే" అన్నట్టు సగర్వంగా దృక్కుల్ని ప్రసరిస్తూ, నవ్వుగా చూసేది.

ఒకనాడు రాత్రి శారద తొందరగా పని ముగించుకొని తన గదిలో కొచ్చింది. రాముడు పిల్లవాడు కేరింతాలు కొడుతుంటే ఆనందిస్తూ, ఆడిస్తున్నాడు. శారద అలా అరగంట నించుంది. అయినా అతని వీక్షణాలావిడపై పడలేదు. శారదకు యెందుకనో దుఃఖం పొర్లుకొచ్చింది.

కుర్చీపై చతికిలపడి, పమిటచెంగుతో కన్నీళ్లు తుడుచుకుంది. అవును— కుమారసంభవమైంది! కాని ఏం లాభం ఒరిగింది? తన భర్త ఇంటిపట్టునే వుంటున్నాడు. తనకేం మిగిలింది? తనతో ఎప్పుడైనా, ఒక్కరోజైనా సాదరంగా మాట్లాడలేదే? తన ఆశలన్నీ అడియాసలైనట్టు తోచింది. అన్నాళ్ళూ కొడుకుమీద పెట్టుకొన్న ఆశలన్నీ అడుగంటాయి. కొడుకు పుట్టిన ప్రయోజనం నిష్ప్రయోజనమే! ఇదివరకు తన భర్త కొన్నాళ్ళకైనా తనవాడు కాకపోడనే ధైర్యం వుండేది. ఇప్పుడది కాస్తా అడుగంటి నట్టనిపించింది. దుఃఖం పొర్లి పొర్లి రాసాగింది.

గబగబా వెళ్ళి రత్తమ్మ మంచం దగ్గర కూచొని 'పిన్నిగారూ!' అని యేడవ సాగింది. రత్తమ్మ మగత నిద్రలో లేస్తూ తెల్లబోయి, "ఏమే, ఇదేమిటే, ఏం కర్మ కాలిందే" అంటూ [illegible]సాగింది.

# శ్రీ దే వి

నల్భైఐదు రూపాయల మీద గుమాస్తాగా చేరేడు, సంజీవరావు. అది ఒక బట్టల మిల్లులో.

యజమానితో ఇంటర్వ్యూ చేసినన్నిక్షణాలు అతని గుండె అదటుతో కొట్టుకోసాగింది ఎందుకనిఅంటే ఉద్యోగపు ప్రయత్నంలో అతను పడిన శ్రమ రాస్తే పెద్ద భారత మంతౌతుంది,

మిల్లు యజమాని సుబ్బరాయ శ్రేష్టి అతని మొహం ఒకసారి పరిశీలించి చూశాడు.

"సరే. ఈవేళనించే పనిలో చేరు" అన్నాడు.

సంజీవరావుకు నెత్తిమీదినుంచి పెద్ద బరువు దింపి నట్టయింది. ఒక అరగంటలో ఆర్డర్లు టైపు ఐ రావడం, అతను పనిలో చేరడం జరిగింది.

అకౌంట్సు క్లర్కుగా అతనికి పని ఇచ్చారు. కొన్ని గంటల్లోనే అతను ఫైలూ్సు, పాత రికార్డ్సూ, అన్నిటినీ పరిచ యం చేసుకున్నాడు.

రెండు గంటలవేళ యజమాని కొన్ని పేబిల్సు ఇచ్చి ఒక గంటలో తప్పులులేకుండా చూసిఇమ్మన్నాడు. అతనాపనిని నెరవేర్చాడు. యజమానికి చాలా సంతోషంకలిగింది. "వెరీ గుడ్" అని మాత్రం అన్నాడు.

సుబ్బారాయుడు, చాలా ధనవంతుడు. అతను స్కూలు ఫైనల్ మూడుసార్లు తప్పితే, తండ్రి గతిలేక వ్యాపారంలోకి

దింపాడు. అతనికి ఆ వ్యాపారంలో శ్రద్ధలేక బట్టలవర్తకంలోకి దిగి, దానిలో వొచ్చిన లాభాలతోనూ, తన సొంత ఆస్తితోనూ, తండ్రి చనిపోయాక ఒక బట్టల మిల్లు పెట్టాడు. యుద్ధపు రోజుల్లో లాభాలు అతన్ని ఆకాశాని కెత్తాయి. ఆ రోజుల్లోనే శ్రేష్టి అనే పదాన్ని కూడా తన పేరుకు త గి లిం చు కొన్నాడు.

యజమాన్ని మొదటి దెబ్బలోనే మెప్పించ గలిగినందుకు సంజీవరావుకు చాలా గర్వం కలిగింది.

సాయంత్రం ఆఫీసునించి రాగానే కాఫీ తాగి, కొంత డబ్బును హోటల్లో అడ్వాన్సుగా యిచ్చి, కొంత డబ్బుతో పళ్ళు కొన్నాడు, యజమానికి బహూకరించటానికి. ఎందుకనో అతని హృదయం ఆనందంతో వుప్పొంగ సాగింది. ఎంత లేదన్నా కొన్నాళ్ళలో పనంతా నేర్చుకొని అకౌంటెంట్ కాలేక పోడు! అదేనేమో అతనిఆనందానికి కారణం. ఆఫీసునించి వొచ్చేటప్పుడే యజమాని ఇంటి ఎడ్రెసు అడిగి వుంచాడు. పళ్ళు సంచిలో వేసుకొని తిన్నగా అటువైపు బయలుదేరాడు.

కొంతసేపటికి యజమాని ఇల్లు చేరాడు. యజమాని కారుషెడ్ ఖాళీగా తెరిచే వుంది. అతనికి ముందర నిరాశ కలిగింది. కాని ఒకవేళ ఇంట్లో వుండి కారు ఎక్కడికన్నా పంపాడేమోనని వీధి గుమ్మం దగ్గరికి వెళ్ళాడు. పల్చని తెర గుమ్మాన్నన్ని కప్పుకుని వుంది. అయినా లోపలి మనుషుల్ని చూడ్డం కష్టం కాదు. కాని లోపలి వాళ్ళకి పై మనుషులు బాగా కనబడతారు. అతడు గుమ్మం దగ్గరే కొన్ని క్షణాలు సాలోచనగా నిలచుని చూశాడు. లోపల అయిదారు సోఫాలు

వున్నాయి. ఒక సోఫా దగ్గర చిన్న టేబుల్ మీద రేడియో పెడుతూ ఎవరో అందమైన స్త్రీ కూచుని ఉంది. అతనికి ముందుకు వెళ్ళడానికి, వెనక్కి పోవడానికి తోచక, సంకోచం లోపడి, ఏమీ చెయ్యలేదు. కొంతసేపు అట్లాగే నించున్నాడు.

లోపలి స్త్రీ రేడియో తగ్గించి "ఎవరది? లోపలికి రావొచ్చు" అంది. కంఠం కూడా చాలా తియ్యగా వుంది.

ఏమీ తోచక సంజీవరావు లోపలికి వొచ్చి పళ్ళ సంచి కింద పెట్టాడు. సంజీవరావు ఎర్రగా లేకపోయినా ముఖంలో కళ వుంది ఏ స్త్రీ దృష్టినైనా కొన్ని క్షణాలు నిలబెట్టే సహజ సౌందర్యం అతనిలో లేకపోలేదు.

ఆ స్త్రీ కళ్ళు విప్పార్చుకుని కొన్ని క్షణాలు అతన్ని చూసింది సంజీవరావుకు అగమ్య గోచరమైంది. ఏం మాట్లాడాలో తెలిలేదు. కళ్ళు అమాయికత్వాన్ని చూపెడుతున్నా మనసులో ఎన్నో ప్రశ్నలు పరుగెత్తాయి! ఎవరావిడ? యజమాని భార్యా? వాళ్ళలో కూడా ఇంత అందమైన వాళ్ళుంటారా? ధనవంతుడు కనక యెవరినన్నా తెచ్చుకున్నాడేమో? కాని సమాధానాలు మాత్రం దొరకలేదు.

ఆవిడే అంది: "ఏమిటది? అలా కూచోండి! ఎవరు మీరు?"

సంజీవరావు భయపడుతూ ఒకసోఫా కొసని కూచుని ఇలా సమాధానాలు ఇచ్చాడు.

"నేను ఆఫీసులో కొత్తగా గుమాస్తాగా చేరేను... నాపేరు సంజీవరావు. యజమాని గారికి బహుమతిగా పళ్ళు తెచ్చాను."

అంతసేపూ అతని మాటలని వినకుండానే అతన్ని చూపులతో కొరుక్కు తినసాగింది, ఆవిడ.

నవ్వుతూ "యజమానురాలిగారికి ఏమిటేలా?" అంది.

సంజీవరావు దెబ్బ తిన్నట్టయ్యాడు. ఏం చెప్పాలో తెలీలేదు.

"నేను బీదవాణ్ణి. ఇంతకంటె ఇంకేమివ్వ గలను? ఇవే యజమానురాలిగారికీని".

ఆవిడ ముఖంలో నవ్వు పోలేదు. కొత్త ఆనందం తొణికిసలాడసాగింది. ఒంటిమీది నగలు, సిల్కుచీర వీధి లోంచి వొచ్చే సంధ్యా కాంతుల్ని ప్రతిఫలింప చేస్తున్నాయి. సంజీవరావుకి మూర్ఛ వొచ్చేలా అయింది. వెంటనే వెళ్లిపోదామనుకున్నాడు. కాని సంభాషణ సగంలో ఆపిపోతే ఏం కొంప మునుగుతుందో?

ఆవిడ వయస్సు ముప్పైలోపు. తెల్లగా అందంగా వుంది. ఆకర్షణీయంగావుంది. కొన్ని క్షణాల నిశ్శబ్దం.

"పేదవారా? పాపం!" వింత నవ్వు నవ్వింది. సంజీవ రావు మనస్సులో భావాలు చెప్పడానికి మాటలు చాలవు. యేదో స్వప్నంలోని భావ పరిణామంలా మారింది అతని ధోరిణి. మౌనంగా సౌందర్యాస్వాదన తప్ప మరేం చెయ్య లేక పోయాడు.

"డబ్బుతోనే భాగ్యవంతులౌతారా? కొందరు అందం లో, కొందరు విద్యాధిక్యతలో, మరికొందరు ఏదో లలిత కళారాధనలో— అందరూ అన్ని విధాలు!"

గట్టిగా నవ్వింది. అతని చెవుల్లో కంచు గంటలు

మోగించినట్టయింది. అర్థం చేసుకున్నట్టు చిరునవ్వు నవ్వాడు.

"యజమానిగారు వొస్తే ఇయ్యండి. నేను వొచ్చానని చెప్పక్కర్లేదు." అన్నాడు, వెళ్లడానికి లేస్తూ.

ఆవిడ కూడా లేచింది.

"మంచిది వెళ్ళిరండి! కాని నాకేమీ బహుమతి తేలేదని బాధపడవొద్దు. మీరాకే నాకో బహుమతిలా వుంది" అంది ముఖంలో నవ్వు మాత్రం తగ్గలేదు.

"మీ పేరు తెలుసుకోవచ్చా?" అన్నాడు అతను వెళ్ళబోతూ.

"శ్రీదేవి" అంది, అగోరకంగా చీర చెరగుని కండువాలా కప్పుకుంటూ.

  

శ్రీదేవి నిజంగా సుబ్బారాయ శ్రేష్ఠి భార్య. అతను చిన్నతనంలో తల్లిదండ్రులు చెప్పినట్టు విని పెళ్ళి చేసుకోలేదు. చాలా ఆలస్యంగా ముప్ఫై ఏళ్ళొచ్చాక శ్రీ దే వి ని నెతికి, ప్రత్యేకం ఆవిడ అందాన్ని వరించి పెళ్లి చేసుకున్నాడు. శ్రీదేవి కూడా వాళ్ల కులానికి చెందినదే అయినా అందాన్ని వరంగా పొంది పుట్టింది. ఆవిడిని చూసిన వాళ్లు ఆవిడ కులం చెప్పగలగడం కష్టమైన పని. అందుకనే సంజీవరావుకి ఆవిడని చూడగానే విపరీతాలోచనలు కలిగాయి.

శ్రీదేవికి వివాహ మయ్యేటప్పటికి పదిహేను సంవత్సరాలు. ఈ పదిహేనేళ్లు వివాహ జీవితం దాదాపు సంతోషమయంగానే గడిచింది. ఆవిడ అసలు చాలా బీద కుటుంబానికి చెందింది. కొంచెం చదువుకున్నది కూడా. సుబ్బి

రాయ శ్రీష్టితో వివాహమయ్యే ముందర ఘోర్తుషారం చదివేది. అలాంటి మనిషిని ఒక్కసారిగా ఈయన తన ప్రేమ ప్రవాహంతో, ఆనందసాగరంలో, తేల్చి పడవేశాడు.

సంజీవరావు వెళ్ళిపోయిన కొన్ని క్షణాలు చైతన్య విహీనైనై కూచుంది శ్రీదేవి. ఇంతగా తన దృక్కుల్ని తన ఆకారంలో బంధించిన పురుషుడ్ని శ్రీదేవి తన జీవితంలో చూళ్లేదు.

ఏదో భర్తతో నిశ్చింతగా బతకడం తప్ప ఎప్పుడూ ప్రేమని గురించిగాని, ఇతర పురుషుల్ని గురించిగాని ఆలోచించి ఎరగదు. కాని ఈవేళ సంతోషంతో నిండిన మనస్సు ఎడతెగని ఆలోచనల్ని చెయ్యసాగింది. ఏ ఆధారం లేక సముద్రంలో ఈదే మనిషికి ఏదో తెప్ప దొరికినట్టు, అంధకారంలో మసిలే మనిషికి వెలుగు కనపడ్డట్టు, అనంతాకాశంలో ఎగిరే జీవికి వాలడానికి చోటు లభించినట్టు అయింది.

శ్రీదేవి సాధారణంగా పరాయి మొగవాళ్ళతో మాట్లాడి యెరగదు. ఇదివరకు యెవరైనా మిల్లునించి, భర్త ఆఫీసునించీ ఏవన్నా వార్తలు తేవడం, అప్పుడప్పుడు రావడం కద్దు. కాని ఎవరితోనైనా సరే, ముక్తసరిగా, అవసరమైనంతే మాట్లాడి పంపించేది.

సంజీవరావులోని ఏదో అసాధారణమైన ఆకర్షణ ఆవిడకి మత్తు కలిగించి అలా మాట్లాడేలా చేసింది.

ఎన్నో ఆలోచనలు యెక్కువై ఒక్కసారిగా తల నొప్పి వొచ్చినట్టయింది శ్రీదేవికి.

''అబ్బ! ఎవడితను? ఒక సామాన్యమైన వ్యక్తికోసం

ఆలోచించి నా మెదడు ఎందుకిలా కష్టపడాలి. మా ఆఫీసులో గుమాస్తా యేగా? అనుకుంది.

అంతలోకి వీధిలో కారుహారన్ వినపడింది.

మెర్క్యురీలైట్ వెలిగించి, లేచి నించుంది. భర్త లోపలికి వచ్చాడు. రాగానే సంచీ యెదట కనపడింది.

"ఏమిటది?" అన్నాడు సోఫామీద కూచుని. శ్రీదేవి పక్క స్టూలుమీద కూచుని బూటు లేసులు విప్ప సాగింది. అతను ఒక చెయ్యి శ్రీదేవి భుజం మీద వేశాడు. రెండో చేతిలో పెద్ద చుట్ట వుంది.

"ఎవరో మీ ఆఫీసులో కొత్త గుమాస్తా మీకు బహుమతిగా పండ్లు తెచ్చాడు" అంది.

"ఎవరు? పిచ్చివాడిలా వున్నాడే! ఇదేం కొత్త ఆనమాయితి? సంజీవరావా?" అన్నాడు శ్రేష్టి.

'పిచ్చి లేదు కాని, పిచ్చి యెత్తించేవాడు' అని లోపల అనుకుని "అవును, అతడే గావును" అంది పైకి.

'సంజీవరావు కాదు నా మనో సంగ్రహణరావు' అనుకుంది మళ్ళా.

సంజీవరావుకూ అంతే! ఆనాటి సంఘటనా, యజమానురాలి ప్రవర్తనా, అతని మనోవీధిలో చాలా రోజుల వరకూ వాటి ప్రభావాన్ని అట్టే పెట్టాయి. చాలా రోజులు ఆలోచనలతో గడిపాడు. ఆఫీసులో పని మాత్రం బాగా చేస్తూండేవాడు. ఆ మరునాటినించి యజమాని అతన్ని యెంతో గౌరవంగానూ ఆదరంగానూ చూస్తూండేవాడు.

  

కొన్నాళ్ళకి అతనికి ఎకౌంటెంట్ పని అయింది. అతని ఆనందానికి మేర లేదు. ఒకరోజు ఉద్యోగంకోసమని గోళ్లు పట్టుకుని కాళ్ళు అరిగేలా తిరిగిన అతను ఇవాళ ఆ ఉచ్ఛస్థితిలోకి వెళ్లకలిగాడంటే అతను పొందిన ఆనందాన్ని కొలవగలగడం యెవరితరం?

ఆ వేళ సాయంత్రం ఆఫీసునుంచి ఇంటికి వెళుతూంటే నౌకరు ఒక చిన్న కబురు అందచేశాడు. "సాయంత్రం ఆరు గంటలకి అమ్మగారు మిమ్మల్ని కనపడమన్నారు" అని.

ఒక్క క్షణం అతనికేం పాలుపోలేదు. ఏమిటీ విశేషం?

అతను అంతా తన శక్తి సామర్థ్యాలూ, తెలివితేటల వల్లే అనుకుంటున్నాడు. కాని ఇప్పుడు అకస్మాత్తుగా తన ఉచ్ఛస్థితికి కారణం వేరేమైనా వుందా? అని అనుమానం కలిగింది. వెంటనే అది బలపడింది కూడా.

యజమాని రెండు రోజుల్నించి వూళ్ళో లేడు. ఏదో అర్జంటు పనిమీద బొంబాయి వెళ్ళాడు. వెళ్ళేటప్పుడు ఆఫీసులోని బాధ్యత తనకే చాలవరకు అప్పగించి వెళ్ళాడు.

యజమాని ఇంటికి వెళ్ళేటప్పటికి శ్రీదేవి అందంగా తయారై గుమ్మం దగ్గర నించుని ఆహ్వానించింది

సంజీవరావు లోపలికి వెళ్ళాడు.

"యెందుకు పిలిపించారు?"

శ్రీదేవి నవ్వు మొహంతో అతన్నోసారి చూసింది. అతను నించునే వున్నాడు. ఆ నవ్వులోనూ, ఆ కళ్ళ వింత చూపుల్లోనూ ఏదో బలమైన కోరిక, లోతైన భావం తోచింది, అతనికి. కాని పైకేం మాట్లాడ తల్చుకోలేదు.

కాని ఎట్లా పరివర్తించినా అతని ఉద్యోగానికి భంగం కలుగు తుందేమో ననిపించింది.

"ఓయ్! భగవంతుడా" అనుకున్నాడు మనస్సులో.

"మరేం ఫర్వాలేదు కూచోండి. కారణం లేకుండా పిలి పించలేను" అంది శ్రీదేవి తను కూచుంటూ. సంజీవరావు కూడా కూచున్నాడు ఓ సోఫామీద, ఓ పక్కగా.

"మీకు ప్రమోషన్ వచ్చిందిటగా" అంది శ్రీదేవి, ఓరగా అతనికేసి ఒక విధమైన ప్రేమ, గర్వం, గొప్పతనం తొణికిసలాడేలా చూస్తూ.

"అవును!" అన్నాడు అతను. ఏ విధమైన భావము అతని చూపుల్లో లేదు. శాంతంగా ఆమెవైపు చూడసాగాడు.

శ్రీదేవి మళ్ళీ అందుకుంది: "అందుకనే పిలిపించాను. మీకు కొత్తగా ఉద్యోగమైనప్పుడు నాకేం బహుమతి ఇవ్వ లేదు— మీ దర్శనంతప్ప. ఈ శుభ సమయంలో మీకు నేను బహుమతి ఇవ్వదలచుకున్నాను. ఇష్టమేనా?"

నౌకరు వచ్చి విద్యుద్దీపాలు వెలిగించి వెళ్ళిపోయాడు. పైన తిరుగుతున్న ఫాన్‌లా అతని మనస్సు, ఆలోచనల సుడి గుండంలో పడి కొట్టుకొని, తిరగ సాగింది. అతని కేమనాలో తెలీలేదు.

"మీదయ!" అని మాత్రం అన్నాడు.

"నడవండి, మీ యింటికి వెడదాం. డ్రైవర్!" అని కేకేసింది.

సంజీవరావు చిత్తయ్యాడు. మనస్సు సుడిగుండంలోపడి మునుగుతుందో, తేలుతుందో తేలేదు. భగవంతుడి మీద

భారం వేశాడు.

కారు గుమ్మంముందు ఆగింది. ఆవిడ లేచింది. సంజీవ రావుకూడా లేచేడు.

"నడవండి" అంది.

"మా యింటికి ఎందుకు?" అన్నాడు అతడు సంకోచంలో పడి.

"అంతా వుంది, చెబుతాను" శ్రీదేవి దారితీసింది.

ఇద్దరూ కారులో కూచున్నారు.

"సంజీవరావు గారింటికి పోవోయ్" అంది యజమానురాలు.

డ్రైవర్ కారుని పోనిచ్చాడు.

పది నిమిషాల్లో అతని యిల్లు చేరుకున్నారు. ఇల్లు చాలా పెద్దదే, కాని అందులో ఐదారు అద్దెకుటుంబాలుంటున్నాయి. మధ్య తరగతికి చెందిన మనుష్యుల్లో వుండే దారిద్ర్య భారం పైకే కనపడుతోంది. ఇంటి ముందర ఆ యిళ్ళ పిల్లలు ఏవో ఆటలు ఆడుకుంటున్నారు, కొందరు బట్టలు లేక, మరి కొందరు, మాసిన, చిరిగిన బట్టలుతోనూ.

సంజీవరావు దిగి ఇంట్లోకి దారితీశాడు. వెనకాలే శ్రీదేవి వెళ్లింది, అతనింట్లోకి నిజంగా లక్ష్మి వెడుతున్నట్టు. అక్కడి పిల్లలు, కారు ఆగడం, ఆవిడ లోపలికి వెళ్లటం, అన్నీ ఆశ్చర్యంతో చూడసాగారు.

సంజీవరావు ఇంట్లో కుర్చీలూ ఏమీ లేవు. ఒక చిన్న పిల్ల ముందుగదిలో ఉయ్యాల్లో పడుకొని ఉంది. శ్రీదేవి వుయ్యాలదగ్గర నించుని, ఆ బిడ్డని ఏకదృష్టితో చూడసాగింది.

ఒక హారికేన్ లైటు వెలుగుతోంది, మధ్యన. అతను దొడ్డి గుమ్మంలోకి వెళ్లి; "ఏయ్, ఏయ్," అని పిల్చాడు. దొడ్లో యెక్కడో పనిచేసుకుంటోంది, అతని భార్య. "వొస్తున్నా" అంది మందమైన కంఠంతో.

అతను మళ్ళా వీధి గదిలోకి వొచ్చి చాప వేశాడు. శ్రీదేవి పిల్లని లేపి, వొళ్ళోకి తీసుకుని కూచుంది, చాపమీద.

"లక్ష్మీ, ఇలారా" అన్నాడు సంజీవరావు.

అతని భార్య లోపలికి వొచ్చింది, చీర చెంగుతో తడి చెయ్యి తుడుచుకుంటూ.

శ్రీదేవిని, వీధిలోని కారునీ, ఆశ్చర్యంగా చూస్తోనే, "నమస్కారం" అంది.

"ఆవిడ మా యజమాని భార్య! నిన్ను చూడాలని వొచ్చారు" అన్నాడు సంజీవరావు.

శ్రీదేవి లేచి ప్రతి నమస్కారం చేసింది.

"అవును, మీ అయనకి ఈ వేళ ప్రమోషన్ వొచ్చిందిట. అందుకని మీ కేమన్నా బహుమతి ఇవ్వాలని వొచ్చాను" అంది. ఆవిడ చేతిలోని బిడ్డ, ఆవిడ ముఖం కేసి, వింతగా చూడసాగింది.

లక్ష్మికి ఇదేం అర్థం కాలేదు. కాని "యెంతమాట!" అంది.

సంజీవరావేదో సంజ్ఞ చేసేడు. లక్ష్మి లోపలికి వెళ్ళింది.

"నిజంగా లక్ష్మే!" అంది శ్రీదేవి కూచుంటో.

తను మౌనంగా తలవొంచుకున్నాడు. ఆవిడ కళ్ళల్లో

ఏదో భావం మెరియడం అతను స్పష్టంగా చూశాడు.

లక్ష్మి ఓ గాజు గ్లాసులో కాఫీ తీసుకొచ్చి, ఆవిడ కిచ్చింది.

"మీరు తాగరా?" అంది శ్రీదేవి.

"ఆయన హోటల్లో తాగి వొస్తారు. నాకు పట్టింపు లేదు'' అంది లక్ష్మి. కాని అది సర్దడానికి అన్నమాటేననేది వాళ్ల ముఖాల్లోని సిగ్గుతో కూడిన భావం దానంతటదే తెలీచేస్తోంది.

శ్రీదేవి మాట్లాడకండా కాఫీ తీసుకుంది.

"మిమ్మల్ని చూడ్డానికి చాలా సంతోషంగా వుంది'' అంది శ్రీదేవి.

"మీదయ. అప్పుడప్పుడు వొస్తూండండి" అంది లక్ష్మి.

''యెందుకు రాను?''

''మీ మాటే పదివేలు; అయినా చూస్తాంగా?''

"రానూ, అమ్మాయ్, నువ్వు నిజం చెప్పు" అంది శ్రీదేవి, పిల్ల మొహంమీద మొహం పెట్టి ముద్దుపెట్టుకుంటో.

''ఉఁ! ఉఁ! ఉంగా!" అంది పిల్ల. అందరూ ఒక్కసారి నవ్వారు.

''నిజం చెప్పావమ్మా" అని తిరిగి ముద్దు పెట్టుకుంది.

"ఇదిగో, బహుమతి!" అని పిల్లని కింద కూచోపెట్టి, మెడలోంచి నెక్లెస్ తీసి పిల్ల మెడలో వేసింది, ఆవిడ.

"ఇదేమిటి అన్యాయం?" అంది లక్ష్మి ఆశ్చర్యంతో.

"మీ దయ చాలు. మాకివేం వొద్దు" అన్నాడు సంజీవరావు, కంగారుతో.

శ్రీదేవి వినలేదు. వెంటనే లేచి, "ఇక వెళ్ళొస్తా" నంది సగర్వంగా.

వాళ్ళు తెల్లబోయి లేచారు.

''ఇదేం బావుండలేదు'' పిల్ల మెళ్ళో గొలుసు తీయబోయాడు సంజీవరావు.

''నామీద వొట్టు'' అంది శ్రీదేవి.

ఇద్దరూ నిశ్చేష్టు లయ్యారు.

శ్రీదేవి కారులో కూచుంది.

లక్ష్మి పిల్ల నెత్తుకుని గుమ్మంలో నించుంది. సంజీవరావు కారుదగ్గరికి వెళ్ళాడు.

"అన్నట్టు నాకు టైం లేదు. మీరు ఆనక ఓ శేరు ద్రాక్షపళ్ళు తెచ్చి పెడతారా?" అంది శ్రీదేవి.

''అంతకంటేనా? ఇదేం ఘనకార్యమని" అన్నాడు సంజీవరావు

కారు వెళ్ళిపోయింది.

♦ ♦ ♦

అప్పటికి రాత్రి ఎనిమిదైంది.

"భోజనానికి లేవండి" అంది లక్ష్మి. సంజీవరావు బట్టలు మార్చుకుని, కాళ్లు కడుక్కుని అన్నానికి లేచాడు.

భోజనాలు అయ్యేంతసేపూ వాళ్లిద్దరూ వింతగా మరీ మరీ తర్కించుకోసాగారు. చివరికి ఈ నిర్ణయానికి వొచ్చారు.

'లక్షాధికారులకి ఓ అయిదారు వందలు లెఖ్ఖా'.

భోజనాలు అయ్యాక భార్య ద్రాక్షపళ్ల సంగతి జ్ఞాపకం చేసింది.

అతను వెంటనే బజారుకివెళ్ళి, ఓ శేరు పళ్లు తీసుకుని, యజమానింటికి బయలు దేరాడు.

ఆ ఇల్లు చేరే టప్పటికి రాత్రి తొమ్మిదిన్నరఅయింది. శ్రీదేవి తెల్లని దుస్తుల్తో, అందమైన నగల్తో ఓ అప్సరసలా తయారయివుంది

తను పళ్ళుతీసుకుని లోపలికి ప్రవేశించాడు.

"వొచ్చారా? రారేమో ననుకున్నాను"

"ఎందుకురాను?" అతనికళ్ళు కృతజ్ఞతతో మెరిశాయి.

"ఆ మాత్రం ప్రేమవుంటే నేను ధన్యురాల్నే"

ఈ మాటలు అతనికి అర్థం కాలేదు. అందుకని మౌనం వహించాడు, వింతగా చూస్తో.

"ఏం ద్రాక్షపళ్ళు తెచ్చారు?"

"నల్లద్రాక్ష"

"అవెందుకు తెచ్చారు?" కోపంగా అంది.

"ఇవే తియ్యగా వుంటాయి!" అన్నాడు భయంగా.

"పచ్చ ద్రాక్షా?"

"పుల్లగా వుంటాయి"

"ఎర్ర ద్రాక్ష?" పక్కున నవ్వింది.

అతను మాట్లాడ లేదు.

"ఏం చెప్ప రేం?"

"నేను వాటిని చూళ్లేదు" అన్నాడు.

"ఇవిగో చూడండి, రుచి చూచి, ఎలా వున్నాయో చెప్పండి."

దగ్గరగా వొచ్చి నించుని, తన పెదిమిల్ని చూపించిం

ది. ఉచ్ఛ్వాస, నిశ్వాసాల ఎగప్రుల్లో ఆవిడ వక్షం తనకి తగు ల్తుందేమోననే భయం కలిగేంత దగ్గరగా నించుంది.

ఇప్పటికి సంజీవరావుకి కథ అర్థం అయింది. ఇలాంటి కథలు అతను చాలా విన్నాడు, కాని అది ఎవరో అదృష్టవంతుల సంగతి అనుకున్నాడు. ఇలా నవలాత్మకమైన సంఘటన మాదిరిగా జరుగుతుందని అతను అనుకోలేదు. ఒక క్షణం సందిగ్ధంలో పడ్డాడు. ఏమి చేసినా భావి చెడనూ వొచ్చు, అదృష్టం పట్టనూ వొచ్చు. ఒక్కసారి భార్య గుర్తుకు వొచ్చింది. మనస్సులో అంతఃకలహం చెలరేగింది.

శ్రీదేవి అతని కళ్ళలోకి తీవ్రంగా చూడసాగింది.

"నా లక్ష్మివే నువ్వు" బలంగా దగ్గరికి తీసుకున్నాడు. శ్రీదేవి తన్మయత్వం చెందింది.... ..

♦ ♦ ♦

సుబ్బరాయ శ్రేష్టి ఓ దుర్వార్తతో బొంబాయినించి వొచ్చాడు. అతనికి ఏదో కారు ప్రమాదంలో నడుం విరిగింది టెలిగ్రాం వొస్తే సంజీవరావు, శ్రీదేవి స్వయంగా వెళ్ళి, బొంబాయి నించి అతన్ని తీసుకొచ్చారు, ఫస్టు క్లాసులో.

ఇంటికొచ్చిన కొన్నాళ్ళకి సుబ్బారాయుడు సంజీవరావుకే మేనేజరు పని ఇచ్చి, మిల్ మేనేజ్మెంట్ అంతా అతని చేతిలో పెట్టాడు. సంజీవరావు బాధ్యతనంతా స్వీకరించాడు. కాని నమ్మకద్రోహంచేసేంత మూర్ఖుడవదల్చుకోలేదు

సుబ్బారాయుడు పడక కుర్చీమీద నుంచి లేవలేడు. అక్కడే ఎప్పుడూ వుండి, మిల్లు పనులు స్వయంగా సంజీవరావుని పిలిపించి చూస్తుండేవాడు.

శ్రీదేవికిది ఒక విధంగా బాధగా వున్నా మరో విధంగా పెద్ద అడ్డంకు తీరినట్లనిపించింది.

సంజీవరావుతో ప్రేమ కలాపాలు నిర్విఘ్నంగా సాగే ఏర్పాటులన్నీ చేసుకుంది. శ్రీదేవి ప్రేమ 'లక్ష్మి' రూపంలో సంజీవరావు ఇంటికి ప్రవహించ సాగింది.

కొన్నాళ్లలోనే అతను కారుకొని పెద్ద ఇల్లు అద్దెకి తీసుకున్నాడు. ఈ సంగతి లక్ష్మి కనిపెట్టక పోలేదు. కాని భర్త దగ్గర నోరెత్తే ధైర్యం లేదు.

అయినా అక్కడికీ అంది.

"మీరు రోజు రోజుకీ మారిపోతున్నారు"

"ఏం చెయ్యమంటావు? అదృష్టాన్ని కాలతన్నమంటావా? దరిద్రంలోనే బతకాలని వుందా?"

లక్ష్మి బదులు పలుకలేక పోయింది. పైపై సుఖాలు ఎంతగావున్నా, భర్తని పోగొట్టుకొన్నాననే బాధ ఆమెలో పోలేదు.

మళ్లీ కొన్నాళ్లు పోయాక ఈ క్రింది సంఘటన జరిగింది. సంజీవరావు భోజనం చేస్తున్నాడు, ఓ రాత్రిపూట. లక్ష్మి అంది: "మనకీ అదృష్టం చాలు".

"నీ ఉద్దేశం?"

"చాలా రోజుల్నించి సహిస్తున్నాను. ఇంక అ శ్రీదేవి జోలి మనకు వద్దు. ఈ మాత్రం అదృష్టం మనకి చాలు. కావలిస్తే ఆవిడకి కృతజ్ఞులంగా వుందాం. నా అభ్యంతరం లేదు"

సంజీవరావు మాట్లాడలేదు. భోజనమై కంచంలో చెయ్యి కడుక్కొని లేవబోయాడు.

"ఏం మాట్లాడకుండా లేస్తున్నారు?"

"ఏం చెప్పను? నీలో ఎప్పుడూ లేంది ఈర్ష్య పుట్టిందే మిటా? అని ఆలోచిస్తున్నాను. ఆడాళ్ళు ఈర్ష్యకు లోను కాకూడదు. ఈర్ష్యని జయించిన వాళ్ళు అమరత్వాన్ని సమీ పిస్తారన్న మాట."

లక్ష్మి కళ్ళలో నీళ్ళు నిండాయి.

"ఈర్ష్య కాదు. కాని నా జీవితం? మీరు ప్రేమించి నట్లు ఆవిడని ప్రేమించమంటే నేనూ ప్రేమిస్తాను. గౌరవిస్తా ను. కాని ఆవిడతో సంబంధం నాకు ఇక మీదట బాగు లేదు" అని ఖచ్చితంగా చెప్పింది.

సంజీవరావు లేచి బట్టలు మార్చుకున్నాడు.

"వెడతారన్న మాట"

"నీ మాటలకి బదులు చెప్పటం కష్టం".

"ఈ జీవితాన్ని భరించడం నాకు కష్టం అవుతోంది. లోకం నోరు మూయ్యడానికి మూకుడుందా? నాకు ఇంక ఓపిక లేదు. మిమ్మల్నీ, మీ గౌరవాన్నీ సంరక్షించుకోడానికి అర్ధాంగినైన నాకు హక్కుంది"

లక్ష్మి గుమ్మానికి అడ్డు వెళ్ళింది.

"ఏమిటిది, లక్ష్మీ?" అన్నాడు సంజీవరావు, కోపంతో.

గోడ గడియారం తొమ్మిది కొట్టింది.

"ఈ వేళకి తప్పుకో! తర్వాత అంతా చెబుతాను" మళ్ళా లాలనగా అన్నాడు.

"ఏమ్లేదు" గుడ్లనీరు నింపుకునే అంది.

"లక్ష్మీ!" గట్టిగా అరిచాడు సంజీవరావు.

"తప్పుకో!" గద్దించాడు.

"వీల్లేదు. వీల్లేదు. వీల్లేదు." రెట్టించి అంది; గొంతు జీరపోయింది.

"స్టుపిడ్, గెటవుట్" అని పక్కకి తోసి వెళ్లిపోయాడు సంజీవరావు. లక్ష్మి కిందపడిపోయింది. బద్దలైన చేతుల గాజుల ముక్కలు గదంతా చెల్లా చెదరు అయ్యాయి, బూట్ల చప్పుడు క్రమంగా అంతర్థాన మైంది! తరువాత కారు ధ్వనీ.

లక్ష్మికి దుఃఖం ఒక్కసారిగా పొర్లి వొచ్చింది.

"అమ్మా!" అని చేతుల్లోకి ముఖం తీసుకుని వెక్కి యాడవ సాగింది.

"అమ్మా" అంటూ కెవ్వున నిద్దట్లో కేక వేసి కూతురు లేచింది. తల్లి దగ్గరికొచ్చింది.

"ఏడవకే అమ్మా" అని కళ్ల నీళ్ళు తుడవ సాగింది, చిన్న చేతి వేళ్ళతో.

  

సుబ్బరాయ శ్రేష్ఠి శారీరకంగానూ, మానసికంగానూ కూడా క్రమంగా నీరసించి పోయాడు. తన అంత్యదశ సమీపించినట్టు ఎప్పుడో తెలుసుకున్నాడు. శ్రీదేవి ఈ పరివర్తనని కూడా అతను గమనించక పోలేదు, ఓరోజు ఇలా జరిగింది.

అతను మామూలుగా తన పక్కమీద పడుకున్నాడు. పక్కన శ్రీదేవి మంచం వుంది. అతనికి నడుం విరిగిన నాటి నించి సాంసారిక జీవితాన్ని బలవంతంగా విసర్జించ వలసి వొచ్చింది. ఎప్పుడూ, మంచంమీద గాని, పడక కుర్చీలో గాని వెల్లకిలా పడుకునే వుండాలి. పక్కలికి తిరగడానికి

కూడా వీలులేక పోతోంది.

ఆరోజు రాత్రి మూడు గంటలవేళ మెలుకువ వొచ్చింది. రాత్రి గాలి మెల్లగా సంగీతాన్ని పాడుతో వీస్తోంది. ఆకుపచ్చని బల్బుకాంతి దోమతెరని చించుకుని లోపలికి వొస్తోంది. ఆ వెలుతురులోనే మెడ పక్కకి తిప్పి శ్రీదేవి పక్కకేసి చూశాడు. అది శూన్యంగా కనపడింది. మళ్లీ రెండు మూడుసార్లు చూశాడు. కాని మొదట చూసింది నిజమే అయింది.

"శ్రీదేవీ..." మెల్లిగా పిలిచాడు. బదులు రాలేదు. అతనికేమీ తోచలేదు. శ్రీదేవి అన్నాళ్ళూ అతనికి తెలియనంతగా తన ప్రివర్తనని దాచి పెట్టింది. ఎక్కడికైనా వెళ్లిందేమోనని అతననుకున్నాడు. తర్వాత నిద్దర పట్టలేదు. అరగంటపైగా గడిచింది. శ్రీదేవి రాలేదు. అతని మనసు ఎంతో ఆందోళన పడసాగింది. ఏవేవో ఆలోచనలు తోచాయి. తన జీవితాన్నంతటిని వెనకచూపు చూసుకున్నాడు. సంఘంలో తను ఈ ఉన్నతస్థానం పొందడానికి పడిన శ్రమా, బాధా అన్నీని. తర్వాత శ్రీదేవి తోటి తన జీవితాన్ని మొదటినించి తల్చుకున్నాడు. కళ్ళు ఆనందబాష్పాల్తో నిండాయి. అవే కొన్ని క్షణాల్లో దుఃఖాశ్రువులుగా మారాయి. ఒక్కొక్క బాష్ప బిందువే అతని మాసిన గెడ్డంలోంచి నెమ్మదిగా జారి పక్కమీద పడసాగింది.

కాకులు కూతలు ప్రారంభించాయి. ఆలోచనల్తోనూ, బాధతోనూ అతనికి చాలా అలసట కలిగింది.

గడియారం ఐదు కొట్టింది. శ్రీదేవి కిందినించి మేడ

మీదికి వొచ్చింది. చేతుల గాజులూ, కాళ్ళ కడియాల అడుగున వరసగా కట్టిన చిన్న మువ్వల గలగల ధ్వనీ ఆమె ఎంత నిశ్శబ్దంగా వొద్దామన్నా, ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుని కొంచెంగా వినపడ సాగాయి. నెమ్మదిగా వొచ్చి తన పక్క ని ఆక్రమించుకుంది.

"శ్రీదేవీ ..." అతను నెమ్మదిగా పిల్చాడు. శ్రీదేవి ఉలిక్కిపడింది. గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. చాలా ఆశ్చర్య పడింది. ఏమిటిది?– కాని ఓ క్షణంలోనే తేలుకుంది.

అతను "శ్రీదేవీ..." అన్నాడు మళ్ళీ.

"ఎవరూ! మీరా!" అంది అతనివైపు దొర్లి.

"అవును; నేనే"

"ఏం నిద్దర రావడం లేదా?"

"లేదు; నువ్వు ఇందాకటినుంచి యెక్కడకి వెళ్ళావ్?"

శ్రీదేవి మాట్లాడ్లేదు.

"అప్పుడే రెండు గంటలైంది, మెలకువ వొచ్చి. నిన్ను పిలుస్తే పిలుపులు గాలిలో కలిసిపోయాయి. ఇంతసేపూ ఎక్కడ వున్నావ్?" చాలా నెమ్మదిగానూ, జాలికరంగానూ, స్పష్టంగానూ మాట్లాడాడు.

"కిందికి వెళ్ళాను. ఏ ? ఏం కావాలి మీకు?" శ్రీదేవి బదులుగా అడిగింది.

"నన్ను మోసం చెయ్యడానికి ప్రయత్నం చెయ్యకు శ్రీదేవీ. అది నీ అందానికీ, స్వభావానికీ తగినది కాదు. నువ్వు నన్నెరుగుదువు. నిన్ను యెంతగా ప్రేమిస్తున్నానో నీకూ తెలుసు. నిజం చెప్పు. నాకదే శాంతినిస్తుంది. నేను

యెంతటి నిజాన్నైనా భరిస్తాను గాని. అబద్ధాన్నీ ద్రోహాన్నీ సహించలేను."

నిశ్శబ్ద క్షణాలు కొన్ని గడిచాయి.

శ్రీదేవి మానసిక పరిస్థితిని గురించి చెప్పగలగడం కష్టం. సంజీవరావులోని ఆకర్షణేదో శ్రీ దే వి ని తనవైపు లాక్కుందిగాని, ఆవిడకి సుబ్బారాయుడికి ద్రోహం చెయ్యాలనే తలంపు యెప్పుడూ లేదు అ త ని మీ ద ప్రేమ మారలేదు. అతని ప్రస్తుత పరిస్థితిని బట్టి ప్రేమ యెక్కువైంది. అందుకనే తన రహస్య జీవితాన్ని తను ఇగ్నోర్ చెయ్యా కనిపెట్టలేనంతగా యెక్కువ సేవచేసి, అతన్ని మెప్పించ కలిగింది. కాని లోపల ఒక భయం లేక పోలేదు. సామాన్య మనుష్యుల్లో ఉండే ఈర్ష్య, అసహనం, స్త్రీని గురించిన భావాలు అతన్ని బలిగొని నిజాన్ని తెలుసుకున్న అతన్ని అధోగతికి దారితీస్తాయేమో అని భయపడింది. అందుకనే చాలా జాగ్రత్తగా ప్రవర్తించింది. సంజీవరావూ అంతే! తన ఈ ప్రేమ జీవితాన్ని చాలా రహస్యంగా గడిపాడు. ఒక్క లక్ష్మికి తప్ప యెవరికీ తెలీను. ఆవిడ నోరుకూడ కట్టి వేయబడింది.

"ఏం శ్రీదేవీ, మాట్లాడవేం!" అన్నాడు మళ్ళా.

అతని జాలిగొంతుక వినిపించాక, తన ప్రవర్తనని చూసుకొంటే ఒకరకమైనసిగ్గూ, కించభావం కలిగి, అవమానంతో కళ్లలో నీళ్ళుతిరిగాయి, శ్రీదేవికి ఏం చెప్పాలో తెలీలేదు. కాని యెప్పుడూ లేంది, అతని దగ్గర అబద్ధం ఆడలేక పోయింది. ఆ ప్రయత్నం దానంతటదే చచ్చి పోయింది.

"మీకు ద్రోహం చేస్తున్నాను. పాపిని" అంది రుద్ధ కంఠంతో; తలగడలోకి ముఖాన్ని దూర్చి, వెక్కి వెక్కి ఏడవ సాగింది, యెవరో కొట్టినట్టు. అతను చెయ్యిజాచి "ఇటు రా శ్రీదేవి. ఏమిటది? అసలు సంగతి చెప్పవేం?" అన్నాడు.

శ్రీదేవి అతని పక్కమీదికి వెళ్ళి, పక్కన పడుకుంది. అతను ఒక చేత్తో మెల్లగా తట్టసాగాడు.

"ఏమిటిది? ఏం జరిగింది?" మళ్ళీ అడిగాడు.

"నేను మీకు ద్రోహం తలపెట్టాను"

"ఏమిటది, శ్రీదేవీ?"

"నేను చెడిపోయాను, మీదాన్ని మాత్రమే కాదు."

"ఆఁ! ఏమిటి అంటున్నావు? యెవడా దుర్మార్గుడు? రేపే వాడి పని పడదాం"

"నా అధఃపతనానికి యెవరూ కారణం కాదు నేనే అంతా చేసుకున్నాను. మిమ్మల్ని కాక వేరొకర్ని మనస్సులో ప్రేమించి, చోటు యిచ్చాను. అందుకు నన్నేం చేసినా సరే, నేను సిద్ధమే! వాళ్ళని మాత్రం శిక్షించడానికి వీల్లేదు".

"అల్లాగేలే! యెవరది ముందు చెప్పు?"

"సంజీవరావుని కూడా ప్రేమించాను?"

"సంజీవరావు!" అతని గుండెలు ఝల్లుమన్నాయి. మళ్ళీ రెట్టించాడు. కాని చెవుల్ని నమ్మలేక పోయాడు. ఏమిటి? అంతా కలా? నిజమా? తను అసలు జీవించి వున్నాడా? ఇదేలోకం?

బాగా తెల్లారింది. తూర్పు పక్కనించి యెర్రని వెలుగులు పక్కమీద పడుతున్నాయి.

శ్రీదేవి శిక్షని యెదురు చూస్తున్న నేరస్తురాలిలా, భావరహితంగా చూస్తోంది

"నువ్వూ సాధారణమైన మనిషి వేనన్న మాట. ఎవరినేమనడానికి ఏముంది? అంతా నా దురదృష్టం, ఈ ప్రమాదం అదీని. నువ్వూ సాధారణమైన మనిషి వే!" తనలో తనే గొణుక్కుంటున్నట్లు అన్నాడు.

ఆరోజు తొమ్మిది గంటలకే శేషి సంజీవరావుకోసం కబురు పంపించాడు సంజీవరావు ఏం కొంప మునిగిందోనని వెంటనే వొచ్చాడు.

సుబ్బారాయుడు పడక కుర్చీమీద కూచునున్నాడు. చేతిలో పెద్ద లంక పొగాకు చుట్టవుంది.

"రమ్మన్నారా!" అన్నాడు సంజీవరావు మామూలుగా నిలబడే.

"రా, తమ్ముడూ కూచో" అన్నాడు సుబ్బారాయుడు. ఈ కొత్త రకమైన పిలుపు అతన్ని నిశ్చేష్టుణ్ణి చేసింది ఆశ్చర్యంతో చూడసాగాడు.

"ఏం కొత్తగా వుందా, అలా పిలవడం? నాకు కథంతా తెలిసింది చాలా అదృష్టవంతుడివి. శ్రీదేవి ప్రేమని పొందడం అదో వరం. నేను ప్రేమించి ఆవిడ ప్రేమని పొందాలని చూచాను. కాని నీకు అనాయాచితంగా ఆవిడ ప్రేమ దొరకడం చాలా అదృష్టం. నా దృష్టిలో శ్రీదేవో దేవకాంత"

అతని కళ్ళు చెమ్మగిల్లాయి. సంజీవరావు తీక్షణ వీక్షణాల్తో నేలని చీలుస్తున్నాడు.

శ్రీదేవి రెండు కప్పుల్తో, కాఫీ తెచ్చి అక్కడపెట్టింది.

తర్వాత నెమ్మదిగా వారికి భర్త పాదధూళి తీసుకుని కళ్లకు అద్దుకుంది. సంజీవరావుకు దూరంనుంచే నమస్కరించింది, మనస్సులో.

సంజీవరావుకి అంతా అగమ్యగోచరంగా వుంది. ఏమిటీ విశాలాంతఃకరణ? యెవరన్నా ఇల్లా క్షమిస్తారా? అతను కోప గిస్తే ఈపాటికి డిస్మిస్ చేసి, నేలని రాసి పారవెయ్య వొచ్చే? యెలా క్షమించాడు ఇద్దర్నీ? ఇలాంటి మనుష్యులు కూడా లోకంలో వుంటారన్నమాట! అతని మంచే తనికి పెద్ద శిక్షైనట్టు బాధపడసాగాడు.

చివరికి "ఇవాళే నేను విల్లు రాయాలి. అందుకు తగిన ఏర్పాటులన్నీ చెయ్యండి" అన్నాడు శ్రేష్ఠి.

  

సంజీవరావు ఇంటి ముందర కారు ఆగి యజమాని మరణవార్త చెప్పింది. సంజీవరావు సంసారంతో కూడా బయలుదేరాడు.

సుబ్బారాయుడు గుండె ఆగి మరణించాడు. శ్రీదేవి గుండె పగిలేలా ఏడుస్తోంది. లక్ష్మి వెళ్లి శ్రీదేవిని ఓదార్చ సాగింది. కొన్ని నిమిషాల్లోనే మిల్ జనం అంతా అక్కడ చేరారు. అందరూ అన్ని విధాల శ్రేష్ఠి గొప్పతనాన్ని పొగడ మొదలు పెట్టారు. అతను కట్టించిన సత్రాలు, నిలపెట్టిన కుటుంబాలు, వాళ్ల కులంలో చదువుకునే విద్యార్థులకిస్తున్న స్కాలర్ షిప్‌లు అన్నీని.

సంజీవరావు మిల్లుకి సెలవు ప్రకటించి దహనక్రియల ఏర్పాట్లు చెయ్యసాగాడు.

పెద్ద ఊరేగింపుతో, మర్యాదతో అంత్యక్రియలు జరపబడ్డాయి.

సుబ్బరాయ శేష్టి తన మిల్లూ, ఇల్లూ సర్వ హక్కులతో భార్యకి ఇచ్చాడు. సంజీవరావును శాయమైన మేనేజరుగా నియమించాడు. తక్కిన కొంత ఆస్థి దానధర్మాలకీ, మిగిలింది తక్కిన దగ్గర చుట్టాలకీ ఇచ్చాడు,

అతను చనిపోయిన నాటినించీ సంజీవరావుని కుటుంబంతో సహా తనింటిలోనే వుండమంది శ్రీదేవి. వారు అంగీకరించారు, చాలా బలవంతం మీద.

కాని శ్రీదేవి ఇదివరకటి మాదిరిగా లేదు. నగలన్నీ తీసివేసింది. తెల్లని సాధారణమైన చీరనే ధరించ సాగింది. తిండి కూడా తినడం లేదు. సంజీవరావు మీద ప్రేమ కూడా ఇదివరకులా లేదు. అంతా ఆధ్యాత్మికంగా మారినట్టయింది. యెప్పుడూ ఆలోచనలతోనే వుంటోంది,

ఇదంతా సంజీవరావుకి అర్థం కాలేదు. ఆవిడకి పిచ్చి యెక్కుతుందేమో అనే భయం కలిగింది.

  

ఒకనాడు ఏడు గంటల వేళ కాఫీ అయి అందరూ కూచున్నారు. మామూలుగా శ్రీదేవి రేడియో పక్కని కూచుంది. రేడియో నించి వచ్చే వార్తల్ని ఆపింది శ్రీదేవి, అకస్మాత్తుగా.

అందరూ ఒక్కసారిగా ఆవిడవైపు చూశారు - ఈవిడేం వార్త చెబుతుందా? అని.

శ్రీదేవి వయసు మళ్ళిన ముత్తైదువులా వుంది. జుట్టు

అదో మాదిరిగా ముడి వేసుకుంది. వొంటినీ నగలేమీ లేవు. తెల్లని అంచులేని సిల్కు చీర కట్టుకుంది. చేతుల్ని ఓ జత గాజులున్నాయి, అంతే ఒక క్షణం తీక్షణంగా చూసింది. గొంతు సర్దుకుంది.

"మీతో యిన్నాళ్లు గల పరిచయానికి చాలా ధన్య వాదాలు. మానవులు యెదో ఆకస్మిక సంఘటనలవల్ల గాని ఇలాంటి పరిచయ భాగ్యాల్ని పొందరు.

"యెందువల్లోగాని నా హృదయం ప్రతి ఫలం ఎరుగని ప్రేమతో నిండి వుంది. మొదట ప్రేమించింది ఆయన్ని. తర్వాత నా హృదయాన్ని చీల్చుకుని ప్రవేశించింది మీరు.

"దీన్ని అందరూ అన్నివిధాలా అనుకోవచ్చును. నీచ మైన కథకింద చెప్పుకో వచ్చును. లేకపోతే తుచ్ఛమైన కామం కింద జమకట్టనూ వొచ్చు. కాని నా దృష్టిలో ఇంత కంటె పవిత్రమైన ప్రేమ కనుపించడం లేదు.

"మొదటి చూపులోనే ప్రేమ అనేది అబద్ధం అని నా నమ్మకం. దానికి అర్థంలేదు. తర్వాత ప్రేమ ఒక్కసారిగా ఉట్టిపడుతుందనే వాదన కూడా నా నమ్మకాన్ని పొందలేదు.

"నన్నడగుతే మోక్షానికి భక్తి యెలా సాధక మార్గ మో, ప్రేమకి కూడా కామం అంతే. అందువల్లే స్త్రీ పురు షులు అంత సన్నిహితులు అవుతారు. మిగతా వ్యక్తులు యెంత స్నేహితం పొందినా వాళ్ల హృదయాలు అంత సన్ని హితం కాలేవు.

"పైగా ఒక స్త్రీ ఇద్దరు పురుషుల్ని సహజంగా ప్రేమించ గలగడం మీద మీకు అపనమ్మకం వుంటే దాన్ని

వాచుకుకోండి. నేను మిమ్మల్నీ, ఆయన్నీ కూడా అదే ప్రేమ తో ఇప్పటికీ ప్రేమిస్తున్నాను. అది అసాధ్యం కాదు. ఎక్కడైనా అది అసంభవం అయితే అది సాధారణంగా పురుషుల్లో వుండే నీచత్వం, జుగుప్స, ఈర్ష్య, అపహాసం, అనుమానాలవల్లే కాని స్త్రీ తప్పు వల్ల కాదు.

"ఇంతకీ నే చెప్పేది, ఇవాళతో నేను మీనించి దూర మవుతాను. ఇది నా తుది నిర్ణయం. ఇదిగో ఈ కాగితం. దీనితో నా ఆస్థిమీద వున్న సర్వహక్కులూ మీవవుతాయి.

"నా కోరికేం లేదు సాయంత్రం రైల్లో కాశీ వరకూ టికెట్ కొని మనః పూర్వకంగా పంపించండి. అదే నాకోరిక. మిమ్మల్నీ, చెల్లినీ మళ్ళీ కలవను.

"కాని వేరే లోకమనేది వుంటే..."

గొంతు పొడారిపోయి, మాటే రాలేదు. కళ్ళు తడి శాయి లక్ష్మి, సంజీవరావూ, తెల్లబోయి, మాటలు వినసాగారు.

వాళ్ళు యెంత చెప్పినా శ్రీదేవి నిర్ణయం మార్చుకో లేదు. ఆ వేళ అక్కడ్నించి కదిలింది...మళ్ళీ ఏమైందో తెలీదు.

సంజీవరావు కూతురికి "శ్రీదేవి" అనీ, ఆ మిల్సులోని గుడ్డలకి "శ్రీదేవీ ఫాబ్రిక్స్" అనీ పేరు పెట్టాడు. ★

## పాలరాళ్ల ప్రేమచిహ్నం

స్వామి రమ్మన్నప్పుడూ, తర్వాత దారిలోనూ నేను చేసిన వితండ వాదన గుర్తుకు వచ్చి, నన్ను చూస్తే నాకే

విచారం కలిగించేలా చేసింది.

అప్పుడు "తాజమహాల్ నిర్మాణానికి, రాళ్లెత్తిన కూలీ లెవ్వరు?...ఇది కాదోయ్ చరిత్ర కర్థం!'' అని శ్రీ శ్రీ గొంతు చించుకుని పాడుతుండడం, ఏ పాతాళ లోకాల్లోం చో వినపడుతున్నట్టు, కొంచెం కొంచెంగానూ, హెచ్చు స్వరంతోనూ వినపడేది.

అందుకే చారిత్రిక ప్రదేశాలు చూడ్డానికి నేను అయిష్టపడింది. మనం నిజమైన చరిత్రనీ, ఆనాటి వాస్తవిక చిహ్నాల్నీ అక్కడ చూడం. వాళ్ళ, అల్లబడిన గాథలకి సంబం ధించిన శిథిలాల్నే చూస్తాం.

"రేపు క్రిస్టమస్ సెలవలకి ఆగ్రా వెళ్ళాలి; మీరు కూడా తప్పకండా వస్తారనుకుంటున్నాం" అని స్వామిఅన్నాడు.

"యెందుకు?" అన్నాను. ఆయన లోపల నవ్వుకున్నా డేమో నా ప్రశ్నకి. అది నాకు తెలియదు. పైకి మాత్రం అన్నాడు:

"ఎక్స్‌కర్షన్! తాజ్ మహాల్‌ని చూడ్డానికి!"

"ఆ రాజరికపు చిహ్నాన్నా?" నా కళ్లల్లో ఆ సమ యంలో కోపం కనపడి వుంటుందనుకుంటాను. నిజానికి అంత గా వాళ్ళు మండుకు పోయింది. ప్రజల రక్త మాంసాలని అన్నివిధాలా పీల్చుకు, పిప్పిచేసి, వాటితో యేవో కళా క్షేత్రాల్ని ఏ భామల కోరికలపైనో, లేకపోతే ఏ పేరు కోసమో నిర్మించిన పూర్వపు రాజుల స్వభావాన్ని తలుచు కుంటే ముఖం కంది పోసాగింది. ఈనాడు వడ్డీలకి వడ్డీలు అమాయకులైన రైతు, కూలీలని ంచి వసూలుచేసి ధర్మ

సత్రాలు కట్టించే వణిక్ప్రముఖుల ధర్మాచరణాలకంటె ఆ రాజుల చర్యల్లో గొప్ప యేమీ కన్పించలేదు నాకు.

కాని అది కొన్ని వందల మైళ్ళ దూరం నించి అన్నమాట!

ఇప్పటి మనోభావం వేరు. అయినా ఇదివరకటి నా దురుద్దేశాలు పూర్తిగా తప్పు కాదనే సంస్కారం మనస్సులో ఇంకా లేక పోలేదు.

సంతోషపు ఔన్నత్యాన్ని మనస్సు రుచి చూసిన రాత్రి, అది. అంత ఆనందానుభవం పొందాను ఎవరికైనా అంతే! అద్వితీయానంద భరితులు ఔతారు. అబద్ధానికాస్కారం లేదు.

గాఢమైన నిశ్శబ్ద పరిపాలనా సాగిస్తున్న రాత్రి!

ఆయనా, ఇంకా ఒకరిద్దరు మిత్రులూ, నేనూ అక్కడికి వెళ్ళాం.

పొగ మంచుని చీల్చుకుని వచ్చిన చంద్రకాంతి, పాలరాళ్లలో ప్రతిఫలించి, మళ్ళా పొగ మంచులో దారి తెలియకుండా కొట్టుకుంటుంటే చూడ గలగడం ఒక గొప్ప వరంగా వును అనిపించింది పిండి ఆరబోసినట్టున్న పండువెన్నెల! మన నీడల్ని, మనకి మన ప్రతిబింబాల్ని చూపిస్తున్న పాలరాళ్లు! వర్ణనకి నాకు మాటల అర్థాలకున్న శక్తి చాలనట్టుగా తోస్తోంది. అంత గొప్పగానూ, ఆహ్లాదకరంగానూ వుంది ఆ దృశ్యం.

అమితమైన నిశ్శబ్దం, చెట్ల నీడల్ని పట్టుకుని వేళ్ళాడే చీకట్లూ కొంత వరకూ విషాద స్ఫూర్తి కలిగించక పోలేదు.

చలికూడా ఎక్కువగానే వుంది స్వామికి ఎంతగా

చలినుంచి కాపాడుకుంటున్నా కొంత రొంప కూడా పట్టింది. ఆయన డాక్టరు. అందువేనేమో అంతగా మంచి ఆరోగ్యంలో వుంటున్నట్టు కనిపించరు.

అందరికీకూడా అంతేగాబోలును! మాట్లాడలేనంత గొప్పతనాన్ని, ఔన్నత్యాన్ని అనుభవిస్తున్నట్టున్నారు. అంతా మౌనంగానే ఆనందిస్తున్నారు. ఏదో ఏ నిమిషంలోనో ఐపోయ్యేదానిలా! స్వామి 'ఇప్పటికన్నా మీ పొరపాటు గ్రహించారా?' అన్నట్టు అప్పుడప్పుడు నావైపు చూడసాగాడు. నేను కూడా నా కళ్ళని 'గిల్టీ'గా చూడడం అనేదాన్నుంచి తప్పించలేకపోయాను, ఎంత బలవంతంగా ప్రయత్నించినా.

ఆ దివ్య భవనంలో ప్రతిబింబించిన మధ్య యుగపు కళా సౌందర్యం కూడా నన్నాకర్షించక పోలేదు. ప్రపంచపు గొప్ప వింతల్లో ముఖ్యమైన వాటిలో ఒకటి! భారతీయ కళా క్షేత్రాల్లో ముఖ్యమైంది!!

పగలు చూసి ఆనందించింది చాలక, మళ్ళీ ఇప్పుడు తీసుక వచ్చాడు స్వామి. అతని లెక్క సరి అయిందే. అంతకంటె వెయ్యిరెట్లు అత్యధిక సౌందర్యాన్ని చూడ గలిగాం మేం, ఆ వెన్నెల్లో.

పహరావాడు ఆవలిస్తున్నాడు. ఆవరణ దాటి బయట పడేటప్పటికి పన్నెండు దాటింది. మనస్సులో అచ్చుపడిన చిత్రం మాత్రం ఎన్నటికీ చెడిపోదనే నమ్మకంతో అందరం ఇవతల కొచ్చాం. కొన్ని వందల సంవత్సరాల చరిత్రని దాచుకున్న ఆ భవనం కనుచూపు మేర దాటే వరకూ తిరిగి తిరిగి మా దృష్టిని ఆకర్షించుకుని మనస్సుని ఇంకా

దోచుకుంది.

అప్పుడే నాకో వింత అనుభవం కలిగింది. ఆ దివ్య భవనంకంటె వెయ్యిరెట్లు అందంగానూ, ఆకర్షణీయంగానూ వున్నట్టుగా కోచే ముంతాజ్ మహల్ ముఖం కనిపించి నట్టయింది. అవును, అది ప్రేమ చిహ్నం, కదూ!

కాని ఒకందుకే విచారం కలిగింది, తర్వాత.

స్వామి ఇంటికి వెళ్ళాక అన్నాడు: "మీరు తాజ్ మహల్‌ని చూస్తున్నప్పుడు శ్రీ. శ్రీ. వాక్యం గుర్తుకు వచ్చిందా?"

"ఏం?" అన్నాను నేను, అనాలోచితంగా. నాకు అసలు ఆ మాటే గుర్తు లేదు, నిజానికి

కొంతసేపయ్యాక స్వామి అన్నాడు, రగ్గులో కాళ్లనించి, తలవరకూ కప్పుకుంటూ:

"అదా మీకు నచ్చింది? అంతసేపూ అదొక చరిత్రాత్మక ప్రదేశమనే సంగతే మర్చిపోయారన్న మాట? దాని గొప్పతనం అనుభవించడంలో అన్నీ గుర్తుకు రావులెండి.

"నాకు మాత్రం అట్లా కాలేదు. యెందుకంటే ప్రతి రాయి రాయికీ వెనకాల వున్న చరిత్ర కన్పించింది, నాకు. వాటిని అక్కడ పదిలంగా పెట్టి భవన నిర్మాణానికి తోడ్పడిన కూలీల చెమట బిందువుల్ని స్పష్టంగా చూడ గలిగాను.

"ప్రతీ చెక్కడంలోనూ ఆ చిత్రకారుల పరిశ్రమ చూడ గలిగాను ఒక మాటలో చెప్పాలంటే ఆ భవనంలోని ప్రతీ అంగుళం తనలో యెన్నో చరిత్రని, సాధారణ మానవులు గ్రహించని చరిత్రని, నిలువ చేసుకుని వుండడం

కనిపించింది, నాకు; 'ఇతిహాసపు చీకటి కోణం అట్టడుగున పడి కాన్పించని' చరిత్రంతా. నన్నడుగుతే తాజ్‌మహాల్ విలువ కట్ట శక్యం కానిది! షాజహాన్ యెంతో అభినందనీయుడు! అతను ముంతాజ్ మరణం తరువాత కార్చిన కంటి నీటి బొట్టుకొక వరహాగా ఖర్చుచేసి ఆ భవనాన్ని నిర్మించి వున్నా డనుకుంటాను. దాన్ని తన ప్రేమ చిహ్నంగా, ప్రియురాలి మీాద ఇష్టం కొలిదీ అతను కట్టించాడు. సాధారణ మానవు లూ, చరిత్రకారులూ అంతే చూడ గలుగుతారు. అట్లానే గౌరవిస్తారు కూడా.

"కాని ఆ భవనం వెనకాల యెంత మందో కష్ట జీవుల జీవిత చరితల్ని, శిల్పుల శిల్ప చాతుర్యాన్ని తరతరాల వర కూ నిలిచేలా చేశాడంటాను. అతను నిర్మించ దల్చుకున్నది తన ప్రేయసికి ప్రేమ చిహ్నం. కాని నిజంగా నిర్మించింది వేలకొలిదీ కార్మికుల, శిల్పుల జీవితాల ప్రతిబింబాన్ని."

తర్వాత స్వామి మానంలో పడ్డాడు. నిద్దరోయూ కేమో కూడా. నాకు చెమటలు గక్కు కుంటూ తాజ్‌మహాల్ని నిర్మిస్తున్న శిల్పులూ, కార్మికులూ, తయారవుతున్న ప్రతిదాన్ని కళ్ళ నీళ్లు కార్చుకుంటూనే, ఆత్మసంతృప్తికోసం పరీక్ష చేస్తున్న షాజహానూ కళ్లకి కట్టినట్టయ్యారు.

'అవును. అది పాలరాళ్ల ప్రేమచిహ్నం—ముంతాజ్‌ది కాదు; వేల కొలిదీ కార్మికులది' అనుకున్నాను నేను, నిద్ర పోడానికి ప్రయత్నిస్తూ.



# నిరీక్షణ

"నాకేమన్నా...?", ఆమే అడిగింది. ఆ అడగడంలో నిరాశ, సంకోచం, యెదురుచూపు, ఆతృత, బిడియం అన్నీ ధ్వనించాయి చంద్రికుమార్‌కు.

"ఏమీ లేవే!" అన్నాడు. ఆమె వెళ్ళిపోయింది. నిలువెత్తున ఉన్న అజంతా విగ్రహం అకస్మాత్తుగా ప్రాణంవచ్చి నడిచి వెళ్ళిపోతున్నంత ఆశ్చర్యం కలిగి, వింతగా ఆ స్త్రీని పరీక్షించ సాగాడు.

'దేనికోసం యెదురు చూస్తోందో?' అనుకుని మళ్ళీ తన పనిలో నిమగ్నుడయ్యాడు.

చంద్రికుమార్ ఆ వూరికి పోస్టుమాస్టరుగా వచ్చి రెండు నెల్లయింది,

అది బ్రాంచ్ పోస్టాఫీసు. అందుకని పోస్టుమెన్ వుండరు. అతనే అన్నీని; ఉత్తరాలు పంచడం, సార్టింగూ, కట్ట కట్టడం అంతా.

గ్రామస్తులంతా టైముకు వాళ్ళే వచ్చి—సాధారణంగా—యెవరి ఉత్తరాలు వాళ్ళు తీసుకు పోతుంటారు. దాని వల్ల అతని బరువు కొంత తగ్గుతోంది. మిగతా ఒకటి రెండు త్తరాలు అతనే వీలున్నప్పుడు పంచుతాడు. వాళ్ళు నిరక్షరాస్యులైతే ఉత్తరం చదివే బాధ్యతా, ఒక్కోసారి జవాబురాసే సహాయతా అతనిపైననే పడుతాయి.

చంద్రికుమార్ మహా నెమ్మదస్తుడు. తియ్యగా మాటా

ష్టం యెరుగును. అందుకనే త్వరలోనే అందరికి హితుడై,
తలలో నాలుకైనట్లు మెలగసాగాడు.

సాయంత్రం వేళలందు నలుగురికీ వార్తా పత్రికలు
చదివి వినిపించడం అతని నిత్య కృత్యాల్లో మరొకటి.

ఇంతైనా అతని జీతం పదిహేను రూపాయలే! పేరు
మాత్రం పోస్టుమాస్టరు! పోస్టల్ రన్నర్‌కు యెనభై వరకూ
జీతం ఉంటుందట!

టపా కట్టి వెయ్యడం అయ్యాక ఆ వేళ పోస్టులో
వచ్చిన దినపత్రిక తీసి చదువుకోసాగాడు. కాని దృష్టి పేపరు
మీదఉన్నా, అతని మనసు మళ్ళా ఆ స్త్రీ మీదికి మళ్లింది.

రోజూ వేళకువచ్చి అడుగుతుంది. అదే ప్రశ్న! అత
ను 'ఏమీ రాలే' దంటాడు. మౌనంగా గృహోన్ముఖురాలై
వెళ్లిపోతుంది.

పాపం, యెందుకో ఆ నిరీక్షణ?

చంద్రశేఖర్‌కు ఏమీ తోచలేదు.

చాలాసార్లు అనుకున్నాడు నిలబెట్టి కారణం అడుగు
దామా? అని. కాని అడగడానికి వలనుపడలేదు. ధైర్యం
కలుగలేదు; ఏమనుకుంటుందో? అని భయం. అతను సహజం
గా బిడియ మనస్కుడు. అందులో ఆడవాళ్లంటే మరీ భయం.
భయమంటే కొడతారనీ, తిడతారనీ కాదు; తను వాళ్ళాతు
ర్యాన్ని ప్రదర్శించడంలో విఫలుడైతే వాళ్ళెక్కడ విముఖత్వం
పొందుతారో? నని. అంతే! అందుకే సంకోచించే వాడు.

ఆమె మధ్య వయస్కురాలు. ఉత్తమ కులానికి
చెందింది కాకపోయినా మనిషి శుభ్రంగా ఉండడంవల్లా

మంచి ఆకర్షణ కలిగివుంది. చామన ఛాయగా వుంటుంది. మొహం అజంతా శిల్పాన్ని గుర్తుకు తెస్తుంది.

ఆమె వ్యక్తిగత ఆకర్షణకంటె, ఆ అంతులేని నిరీక్షణే చంద్రికుమార్ ను ఆకర్షించింది.

ఇదివరకటి పోస్టుమాస్టర్ అతనికి ఛార్జి ఇచ్చేటప్పుడు చెప్పాడు, ఆవిడ ఈ విధంగా గత రెండు సంవత్సరాల నుండి వస్తోందని. కారణం అతనూ చెప్పలేదు.

పాపం, భర్త దూరదేశాల్లో, యే మిలటరీలోనో చిక్కుకున్నాడేమో? అతని నుండి ప్రేమలేఖల కోసం ఎదురు చూస్తోందేమో? అదే నిజమై ఉంటుంది. నిజంగా ఆడవాళ్ళంత ప్రేమైకజీవులు యెవరూ వుండరు? వాళ్ళు ప్రేమదేవతకు, పూజారులకు కూడా దాసులవుతారు; పురుషులే, నీచంగా, వాళ్ళ హృదయాన్నంతా గమనించకుండా, హీనంగా చూసి, హింసిస్తారు. స్త్రీలే అసలైన ప్రేమ దేవతా మూర్తులు!

అతనికి ఆ స్త్రీని ఇలా విడిచి పోయిన భర్తపైన ఎడతెగని కోపం వచ్చింది. ఎన్నో శాపనార్థాలు పెట్టాడు,

'రేపు అడిగేస్తాను. వాడి అంతు కనుక్కునేందుకు సహాయపడి, ఆవిడజీవితాన్ని సుఖమయం చేస్తాను' అని నిర్ణయించుకున్నాడు.

అనుకున్న ముహూర్తం రానే వచ్చింది! రోజూవలెనే ఆవిడొచ్చి, తలొంచుకుని,

"నాకేమన్నా...?" అంది.

"లేదు కానీ..." అన్నాడు, ఏదో చెప్పేవాడిలాఅతను.

విశాల నేత్రాలతో ఒకసారి, 'చెప్పండి' అన్నట్టు వీక్షించింది.

"నా అనవసర ప్రశ్నను క్షమిస్తారనే ఉద్దేశంతోనే అడుగుతున్నా. మీరు మరోలా భావించకండి! మీరు నిరీక్షించేది దేనికోసమో, దయఉంచి, చెప్పగలరా?" అన్నాడు తూచి తూచి.

ఆవిడ:- "అఁ! ఏమీ లేదండీ! రెండేళ్ల క్రితం జరిగిన ఎలక్షన్లలో ఓటు వేస్తే మనియార్డరు పంపుతామని చెప్పారు; అందుకని" అంది నిస్సంకోచంగా.

చంద్రకుమార్ 'ఏ చంద్రలోకం నుండో కింద పడుతున్నానా?' అనుకోసాగాడు.

★

## వెలుగు నీడలు

బాగా చలి వేస్తున్నా, చీకటితోనే, లేచి స్టౌ వెలిగిస్తాడు జయరావు. ఆ వేళనించి అతనికి ఓ వారం వరకు నైట్ షిఫ్టు. పగలంతా శుభ్రంగా విశ్రాంతి తీసుకోవొచ్చు ననుకుంటాడు.

కాఫీ పూర్తి కాకుండానే స్టౌ కిరసనాయిల్‌కు నోరు చాపుతుంది. ముందు దాని తృప్తి తీరుస్తూ 'యుద్ధమైపోయిందిలే!' అనుకొంటాడు, తను కిరసనాయిల్ కోసరం పడిన బాధ తల్చుకొని. పంచదార టిన్ కూడా బోసి నోరేసిందేమోనని భయపడతాడు. కాని ఫ్యాక్టరీ స్టోర్సు ధర్మమా అని అంతపని తటస్థించదు.

తర్వాత సిగరెట్ కాలుస్తూ ఎవో గాలిమేడలు పొగ తో నిర్మిస్తుంటాడు. భార్యను తీసుకొచ్చి సుఖంగా కాపరం పెట్టడానికి 'యుద్ధమై పోయిందికదా!' అనుకుంటాడు. ధరలు తగ్గే సూచనల్ని చూస్తుంటాడు.

మళ్ళీ లేచి ఫ్రాక్కోకి బయలు దేరుతాడు. ఏ ఉద్యోగ కోటా బిగుతుగా పట్టుతుంది. 'యుద్ధమైందిగా! కొత్తది కట్టించుకోగలను' అనుకుంటాడు.

ఇల్లు దాటి స్టాపు యెక్కగానే ఊటీనించి వొచ్చిన సరోజని కలుస్తుంది.

"యెక్కడికి ప్రయాణం?"

వెల్లింగ్టన్ స్టాపు వేలు చూపుతాడు. కాని తనకు వొకసారి ఊటిపోవాలనే కోరిక పోదు. ఎంతకీ పిలుపస్తంలేదు. చల్లని మేఘాలు తనని దాటుకు వెళుతోంటే ఎంతో సంతో షిస్తాడు. అక్కడి పార్క్ గ్లాస్ హౌసెస్‌లోని వివిధ రకాల పువ్వుల్ని కోరిటన్నునీ తను యెప్పటికీ మర్చిపోలేడు.

అసలు నీలగిరీస్ జీవితమే అట్లా వుంటుంది అతనికి. పూర్వం ఇంగ్లీషు నావెల్సులో, సినిమాల్లో చూసిన, వాళ్ళ దేశ వాతావరణం కొంచెంగా కనపడుతుంది అక్కడ.

ఇద్దరు కల్సి మాట్లాడుకుంటూ, నడుచుకు పోతుంటా రు. ఎంతో సజీవంగా వుంటుంది, ఆ జీవితం. కాని తన మురికి పట్నాల్లోని నిర్జీవపు బతుకు ఒకొక్కసారి మనసు ను కలిచి వేస్తూంటుంది.

సరోజిని కొన్న యూకలిప్టస్ ఆకుల్ని తుంచి వాసన చూస్తుంది. దూరంగా బడగా కుర్రవాడు బేరికాయ

తింటూంటాడు.

"ఈ వేళ ఫాక్టరీకి పోనక్కర్లే!"

సరోజిని అడుగుతుంది.

"నైట్ పార్టీ" అంటాడు ముక్తసరిగా.

ఎదరవచ్చే గూడరీని తప్పించుకుందామను కుంటాడు. కాని ఆ దేవాంతకుడు సులువుగా పోనీడు. అనుకున్నట్టుగానే తనను ఆపి అద్దె అడుగుతాడు. "రెండు రోజుల్లో ఇచ్చేస్తా" నని సరిపుచ్చుతాడు.

"రెండు గదులకీ ఫ్లైంటు రూపాయలు. దోపిడీ! అంతా దోపిడీ!! ఉండండి, యుద్ధం పోయింది, మీ అద్దెలు తగ్గుతాయి" అనుకుంటాడు మళ్లీ.

వెల్లింగటన్ పార్కు సమీపిస్తారు. కాని అక్కడ ఆగరు. మార్కెట్టు మీంచి కూనూరు పోతారు.

మారంనించి చల్లగాలి మధ్య మధ్య ఇంగ్లీషువాళ్ల నవ్వుని మోసుకవచ్చి గిలిగింతలు పెడతుంది. మెలికి చుట్టిన తన మఫ్లరు తీసేసి సరోజని భుజంమీంద వేసి, ఆమె చీరతో పోల్చి చూస్తుంటాడు. సిగరెట్ కాల్చుకుంటూ అలవాటు చొప్పున—సరోజినికి ఒకటి ప్రెజంట్ చెయ్యబోతాడు.

కూనూరు చేరుతారు. సరోజిని అడుగుతుంది.

"సినిమాకి పోదామా?"

"అరవ గోలేగా"

"పోనీ బ్రెడ్ అండ్ సాసేజ్‌కి"

మాట్లాడడు. తన కిష్టంలేని పని అని చెప్పేందుకు అతను అవలంబించే విధానమది.

పార్కులో పచ్చికలో పడుకుంటారు. ఏవేవో కబుర్లు చెపుతాడు. అక్కడ ఇంకావున్న తెలుగువాళ్ల క్షేమాన్ని అడుగుతాడు. తాము తెరచిన లైబ్రరీ సంగతీ, తన వుపన్యాసము అన్నీ దొర్లుతాయి.

యూకలిప్టస్ గుబురు మాటునుంచివచ్చే (ఇండైరెక్టు) పరోక్ష సూర్యకిరణం సరోజిని జుత్తుతో ఆడుకోవడం చూసి యెంతో సంతోషిస్తాడు.

మెయిల్ వచ్చే టైమవుతుంది. అద్భుత దృశ్యాలన్నిటికీ 'గుడ్ ఈవినింగ్' చెప్పి, ఇద్దరూ కలిసి ఇంటికి పోతారు.

హోటలువాడు చల్లని భోజనం పెడతాడు 'పాతిక రూపాయలు పుచ్చుకుంటూకూడా ఈచలిదేశంలో ఇదేమిటి? యుద్ధమైంది. నీ రేటు కూడా తగ్గుతుందిలే' అనుకుంటాడు.

రాత్రి పనికి పోతాడు. ఫాక్టరీలో యెవరో కలుస్తారు, ఫోర్‌మన్ దూరంగా వున్నప్పుడు.

"రేపు రేప్పటించి పాతిక మందిని డిస్‌చార్జి చేద్దామనుకుంటున్నారట" అంటారు.

"ఏమి?"

"యుద్ధమైందిగా!"

యుద్ధమై పోయింది! తన ఉద్యోగంకూడా పోయేలా ఉంది; అందులో చివరి బాచ్‌లోని వాడు.

"యుద్ధమయి పోయింది. మళ్ళీ నాకు సిరుద్యోగం తప్పదు, ఐతేనేం స్వేచ్ఛగా బతకొచ్చు" అనుకుని, సమాధాన పరుచుకుంటాడు మనస్సుని, ఇంటికిపోతూ. ★

# భాగ్యనగర్

సాయంత్రం ఐదున్నరై వుంటుంది. ఎర్రటి నీరెండలు లోకాన్ని అరుణకాంతితో నింపుతున్నాయి.

దూరాన్నుండి అతివేగంతో, తన గర్భంలో యెన్నో గత చరిత్రల్ని దాచుకున్న కాలిబాట దుమ్మును రేగకొడతో తోస్తున్న గుర్రం డెక్కల చప్పుడు అకస్మాత్తుగా ఆగింది.

అది మూసీ నదితీరంలో వున్న పల్లెటూరు. పెద్ద పూలవనం వుంది. తోట చుట్టూ ముళ్లకంచె. ఆ తోటలో యెవరో పద్ధెనిమిదేళ్ళ అమ్మాయి పూలు తెంపుతో, పాడుకుంటూ వుంది.

మరుక్షణంలో గుర్రాన్ని వెనక్కి నాలుగడుగులు నడిపించి, ఆ రౌతు కంచెను దాటించి, ఆ అమ్మాయివద్ద గుర్రాన్ని ఆపాడు. ఆవిడ భయపడి పూలసెజ్జని కింద వొదిలేసింది. భయంతో పాట నాపింది.

కాళ్ళాడ లేనట్టుంది; బిత్తర చూపులు చూస్తో, నిశ్చేష్టురాలైంది.

అతడు గుర్రం దిగి పడిపోయిన పూలిసెజ్జను అందించబోయాడు.

ఆ అమ్మాయి తీసుకోలేదు.

"ఎందుకంత కోపం!"

కళ్ల నుండి ప్రేమ ధారలు కురిపిస్తో అన సాగాడు. ఆ అమ్మాయి, మొహంలోకి చూసి, తల దించేసుకొంది.

"ఎవరు నువ్వు?" మళ్లీ అదే తియ్యని కంఠస్వరంతో అన్నాడు.

ఆ అమ్మాయికి కోపం వొచ్చింది. తన తోటలోకి వొచ్చి. తననే యెదురు ప్రశ్నిస్తున్నాడు.

"నువ్వెవరు?" అంది ధైర్యం తెచ్చుకుని.

"మహారాజుని."

మళ్లీ మొహంలోకి చూసింది. ప్రేమవాహిని ఆగలేదు. తలొంచుకుని "ఇక్కడేంపని?" అంది, పీడని ధైర్యంతో,

"వేటకోసం బయలుదేరాను. వొంట్రి చేతులతో తిరిగి పోవడం ఇష్టంలేక..."

పచ్చ గడ్డిమీద చతికిలబడ్డాడు. గుర్రం ఏదో తోచక సకిలించింది.

ఆ అమ్మాయికి ఏం మాట్లాడాలో తోచలేదు.

"పల్లెల్లో ఏం వేట? అడవికి వెళ్ళండి" అంది.

"అడవిలో ఏదీ దొరక్కే ఇక్కడికి వచ్చా."

ఆ అమ్మాయికి ఆ ప్రసంగం వచ్చలేదు. అందుకని కోపంతో:

"దయచేసి ఇక్కణ్ణుండి అవతలకు దయ చెయ్యండి" అంది కఠినంగా, అతని నైపు చూడకుండానే

"ప్రణయంలోనూ, రణంలో వెనకాడ్డం రాజలక్షణం గాదు" అన్నాడు, నోటితో గడ్డిపరకను కదలిస్తో.

"ఇవి న్యాయానికి రోజులు కావు" అని వెళ్లిపోసాగింది.

అతను—వెంటనే లేచి వెళ్లి, అడ్డు నిల్చుని రెండు చేతులూ పట్టుకొన్నాడు.

"నిన్ను ప్రార్థిస్తున్నా, ఒకసారి మొహం మెత్తి ఇలా చూడు." వేళ్లతో గడ్డాన్నెత్తాడు. అతని కళ్లల్లోకి చూసింది, అయిష్టంగానే ఏం చెయ్యడానికి, ఏమనడానికి తోచలేదు.

"నా హృదయేశ్వరివి!" అని గట్టిగా హృదయానికి హత్తుకున్నాడు.

ఆ అమ్మాయి ఉక్కిరి బిక్కిరయింది. "ఏమిటిదీ?" అని విదిలించుకొని దూరంగా వెళ్ళి, నుంచొంది

కాని మనస్సులో అతని సాహసానికి ఆశ్చర్యపడసాగిం ది. అతనివైపు తన హృదయం మొగ్గసాగింది, అనాలోచితంగానే!

తన హృదయ ద్వారాలు ఇంతవరకు తెరిచే వున్నా యి. ఎవరు దానిలో ప్రవేశాన్ని ఆశించలేదు. తనూ ఎవరి నీ ప్రేమించి తన హృదయంలో తావివ్వలేదు. ఈ సాహసకు నికి, ప్రేమ భిక్షువుకు యెందుకు చోటివ్వ కూడదు?

ఆత్మ సంఘర్షణ ఆరంభమైంది.

అతనో గులాబీ పువ్వుని తెంచుకొచ్చాడు. "చూడు! అందమైన గులాబీపూల చెట్టుకీ ముళ్లున్నాయి; నీకూ ముక్కు న కోపం ఉంది. అదే దేవుడి సృష్టిలో వింత అనుకుంటాను" అన్నాడు.

అతనివైపు ఓరగా చూసింది. ఆత్మ సంఘర్షణ అంత మైంది; ప్రేమ దేవతకి తల వొగ్గింది.

"ఆ ముళ్ళు చేరేవాళ్ళ తెలివినిబట్టి బాధించవు. ఏదీ అసాధ్యం కాదు".

అతని కళ్ళల్లో సంతృప్తి తాండవించింది.

"నీ సౌందర్యాన్ని చూసి ముగ్ధుణ్ణయ్యాను. నీ పాదాల

చెంతకు వచ్చి ప్రే మ భి క్ష కో రా ను. ఇంతకంటె ఏం చెయ్యను?'' అన్నాడు; దగ్గరగా వెళ్ళి.

ఆ అమ్మాయి మాట్లాడ లేదు.

''మాట్లాడవేం?'' అని చేతులు పట్టుకున్నాడు.

అంతలోకి "భాగ్యం; భాగ్యం'' అని అరుపులు విన పడ్డాయి.

''మా నాన్న! నేను పోవాలి'' అంది ఖంగారుగా.

''నీ పేరు?''

''భాగ్యమతి...మీరు?''

"మళ్ళా చెబుతా..."

అతడు గుర్రమెక్కి వెళ్ళిపోయాడు ఆ డెక్కల చప్పుడు అంతర్థానమయ్యాక భాగ్యమతి పూలసెజ్జ తీసుకుని ఇంటి వైపు బయలుదేరింది.

## 2

ఆకస్మికంగా జరిగే సంఘటల్ని ఏకథలోనో చదివినా, ఏ సినిమాలోనో చూసినా మనకి యెంతో కృత్రిమంగా కని పిస్తాయి. కాని యదార్థ జీవితాన్ని పరికిస్తే ఆకస్మిక సంఘట నల వల్ల జరిగే గ్రంథ తతంగం యెంతో వుంటుంది. అవి జీవితంలో చూసినప్పుడు యదార్థ విషయాలు కనక తప్పక నమ్ముతాం.

అలాగే క్షణికమాత్రపు నిర్ణయాలెన్నో చరిత్రరీతు ల్నీ, తీరుల్నీ మార్చిన సందర్భాలున్నాయి. వాటిని మనం కాదనలేం.

క్రమ క్రమంగా భాగ్యమతికి ఆ నూతన యువకునితో

పరిచయం యెక్కువైంది. వాళ్ళ రహస్య సమావేశాలు, ప్రణయ కలాపాలు ఎక్కువయ్యాయి.

భాగ్యమతి అతన్ని చూడందే ఒకరోజూ గడపలేక పోయేది. అతనూ అంతే! భాగ్యమతి సందర్శనా భాగ్యరహితుడై మనలేక పోయేవాడు.

అది వర్షాకాలం!

ఉదయం మొదలు ఎడతెగని వర్షం కురుస్తోంది. కారుమేఘాలు క్రమ్మటం వల్ల సాయంత్రమే చీకటిపడి నట్టుగా వుంది.

మూసీనది, వర్షపు నీరు చేరడంవల్ల, వెల్లువలై పారుతోంది.

ఆకాశంలో మెరుపులూ, ఉరుములూ ఏదో ప్రళయం రాబోతున్నట్టుగా సూచిస్తూ వున్నాయి.

"చలో, చలో" అంటూ కొరడాతో గుర్రాన్ని అదలిస్తూ మన పరిచయస్థుడు ఏటికి అడ్డంగా ఈదసాగాడు. ప్రవాహంలో మునుగుతూ తేలుతూ అతి కష్టం మీద అరగంట తర్వాత నాలుగు ఫర్లాంగుల దిగువన గట్టు చేరుకున్నాడు. అలసిపోయిన గుర్రం నురుగులు గ్రక్కుతోంది.

మళ్లీ వెంటనే యజమాని దాన్ని ఆ తోట వైపు దౌడు తీయించాడు.

ఓ పాకలో నుండి "ఇటు, ఇటూ" అని పిలుపు వినపడింది.

అతను అటు వెళ్ళాడు.

"వచ్చారా?"

"ఎందుకు రాను?"

"ఇంత వర్షంలో......"

"నువ్వు మాత్రం యెందుకు నిరీక్షిస్తున్నావ్...? నాకు తెలుసు."

"నాకూ తెలుసు. చూడండి! బట్టలు ఎలా తడిశాయో ముందు ఆ తడిబట్టలు వదలండి."

అతడు పై దుస్తులు తొలగించాడు. లోపల పొడిబట్ట లున్నాయి.

భాగ్యమతి అతని నుదుటిమీద నీళ్లను తుడవసాగింది.

అత నామెను కౌగిట్లోకి తీసుకున్నాడు...ఇద్దరు కొన్ని క్షణాలు మాట్లాడ లేదు.

"మీరు ఇట్లాంటి దారుణానికి తయారైతే ఎలా? తుపానులో వస్తే వొప్పుకునేది లేదు."

"రాణిగారి ఆజ్ఞ అనుసరించక తప్పుతుందా?"

"నిజమే; నామీద ఒట్టు."

"అంత మాటెందుకు?"

కొంతసేపు గడిచింది. బయట వాన తగ్గలేదు. అతను వెళ్లడానికి లేచాడు.

"ఇంత తుపానులో!"

"ఫరవాలేదు"

"నేను వదలను" చెయ్యి గట్టిగా పట్టుకుంది. అతను నవ్వాడు అదే ప్రేమగా నన్ను. "మళ్ళీ వస్తా, వస్తాక తప్పదు."

బుగ్గమీద మీటి గుర్రాన్ని ఎక్కి వెళ్ళిపోయాడు.

ఎక్కడో దూరంగా పిడుగు పడినట్లయింది. భాగ్య

మతి గుండెల్లో రాయిపడింది.

## 3

మళ్ళీ పదిహేను రోజుల వరకూ భాగ్యమతి ప్రియుని కోసం వృధాగా యెదురు చూసింది.

పై సంఘటన జరిగిన మర్నాడే వర్షం తగ్గింది. తన ప్రియుడు వెళ్ళగానే కొంగు చప్పుడు వింది. ఏవేవో చెడు ఆలోచనలు తోచసాగాయి. కాని ప్రేమ మీద నమ్మకంతో వాటిని బలవంతంగా దూరంగా తోలసాగింది.

రెండు రోజుల్లోనే మూసీనది వద్ద వంతెన నిర్మాణం ప్రారంభమైందని వింది. ఎంతో సంతోషించింది; తనప్రియుడు సులువుగా తనను చేరవచ్చునని.

కాని తన ప్రియుడెవరో భాగ్యమతికి తెలియదు. రెండు మూడుసార్లు అడిగింది. "సమయం వస్తే నేనే చెబుతా" అనేవాడు. అతని ప్రేమను నమ్మి, మళ్ళీ ఆ ప్రశ్న అడగలేదు.

♦ ♦ ♦

గోల్కొండ నవాబ్ సుల్తాన్ ఇబ్రహీం కుతుబ్‌షా గారికి యువరాజు మహమ్మద్ మూసీనదిని దాటి జ్వరం పడ్డాడనే వార్త చాలా విచారాన్ని కలిగించింది.

వెంటనే మంచి వైద్యుల్ని, హకీముల్ని పిలిపించి వైద్యం చేయించ సాగాడు.

తన వజీర్ సాహెబ్‌కు తక్షణం మూసీ నదిపైన నెల లోపల వంతెన నిర్మించాలని ఫరమానా జారీచేశాడు.

యువరాజు మహమ్మదుకు చాలా జబ్బు చేసింది. పది

రోజుల వరకూ మూసిన కన్ను తెరవలేదు.

అన్నాఖ్యా ఏదో కలవరిస్తూనే వున్నాడు. కాని వివరాలు యెవరికీ తెలిలేదు. వైద్యులు మాత్రం యువరాజు ఏదో మనోవ్యధకు బాధపడుతున్నాడని కనుగొన్నారు. అది ఇంకా సుల్తాన్ వారికి తెలుపలేదు. అందుకు భయపడసాగారు.

♦ ♦ ♦

ఇబ్రహీం కుతుబ్‌షా పేరు అందరూ వినే వుంటారు. ఆయన 1550 నుండి 1580 వరకు గోల్కొండ ఆంధ్రసామ్రాజ్యాన్ని పరిపాలించాడు.

గొప్ప విద్వాంసుడు. ఇబ్రహీంబాగ్, పుష్పవనం అనే తోటలు వేయించాడు. హుస్సేన్‌సాగర్, బుడ్వేల్ చెరువులు కట్టించాడు.

అప్పుడు రాజ్యం ఒరిస్సా నుండి పెన్న వరకు విస్తరించి వుండేది.

టర్కీ, అరేబియా, పర్షియాలతో వర్తక వ్యాపారాలుండేవి.

ఎంతోమంది తెలుగు కవులను పోషించాడు. అద్దంకి గంగాధరుడనే కవి "తపతీ సంవరణోపాఖ్యానం" అనే గ్రంథాన్ని ఇబ్రహీం షాకు అంకిత మిచ్చాడు. ఈయన్ని "మల్కిభరాం" అనే పేరుతో తెలుగు కవులు కీర్తించారు. "నిరంకుశోపాఖ్యానము" అనే కావ్యాన్ని, "సుగ్రీవ విజయము" అనే యక్షగానాన్ని రాసిన కందుకూరు రుద్రకవికి ఈయన చింతల పాలెం అనే అగ్రహారం దానం చేశాడు. పొన్నగంటి తెలగన్న అనే కవి అచ్చ తెనుగులో "యయాతిచరిత్ర"

అనే గ్రంథాన్ని రాసి, ఈయన సర్దారైన అమీన్‌ఖాన్ అనే అతనికి అంకితమిచ్చాడు. ఈయన కాలంలోనే శివధర్మోత్తరము, షట్ చక్రవర్తుల చరిత్రము, ఆదిగాగల గ్రంథాలు రాసిన మల్లారెడ్డి మొదలైన కవులు ఎందరో వర్ధిల్లారు.

♦ ♦ ♦

మహమ్మద్ కొంచెంకోలుకోగానే "భాగ్యమతీ, భాగ్యమతీ!" అని గట్టిగా పలవరించ సాగాడు.

ఈ వార్తను విన్న సుల్తాన్ కొడుకును చూడ్డానికి వచ్చాడు.

యువరాజు మళ్ళీ అదే పలవరింత.

అప్పటికి అందరికీ తెలిసింది. యువరాజు పడిన ప్రణయమే ఇంత ప్రళయాన్ని కొని తెచ్చిందని.

4

మరో నెలరోజులు గడుస్తేనే గాని యువరాజు పూర్తిగా ఆరోగ్యవంతుడు కాలేదు. అప్పుడు సుల్తాన్ యువరాజును "బాలా హిస్సార్"నకు పిలిపించాడు.

మహమ్మద్ కొంచెం బలం చేరినప్పట్నుంచీ కుతుబ్ న్యాయశాలపై డాబా మీదికి పోయి, సాయంత్రం వేళలందు మూసీనది వైపు, మూసీనదికి ఆవలవున్న పల్లెవైపు శూన్యదృక్కుల్ని ప్రసరిస్తుండేవాడు. అక్కడి నుంచి చూస్తే ముప్పై మైళ్ళ వరకూ కనపడుతుంది.

ఒకనాడు అలాగే భాగ్యమతిని తల్చుకుంటూ వుంటే సుల్తాన్ వారి కబురు వచ్చింది.

వెంటనే వెళ్ళాడు.

సుల్తాన్‌కు ఎలా ప్రారంభించాలో తెలీలేదు.

"భాగ్యమతి ఎవరు?" అని నవ్వుతో ప్రశ్నించాడు. యువరాజు నుంచునే సిగ్గుతో తలవంచుకున్నాడు.

మళ్లీ ఇబ్రహీంషా అనసాగాడు: "నాకు కథంతా తెలిసింది. కాని గొప్ప గొప్ప వజీర్లు, సర్దారులు కోట్ల కొలది హొన్నులతో తమ అపురూప సుందరులైన కన్యల్ని యిస్తామంటుంటే ఇదేమిటి?"

"నేను ఆ అమ్మాయిని పెళ్లి చేసుకుంటానని మాట ఇచ్చాను."

"మన ఇస్లాం మతం...?"

"మీరు అన్నీ తెలిసినవారు; హిందూ, మహమ్మదీయ సఖ్యతకు ఎంతో పాటుపడేవారు. మీకు ఏం చెప్పాలి? ఐనా మన మహమ్మదీయ రాజులు హిందూ స్త్రీలని పెళ్ళాడిన సంఘటనలు చరిత్రలో యెన్ని లేవు?"

ఇబ్రహీంషాకు ఏమీ తోచలేదు.

"నీ ఇష్టం? బాగా ఆలోచించు. నువ్వు కాబోయే సుల్తాన్‌వని గుర్తుంచుకో!" అని మాత్రం అన్నాడు.

యువరాజు వెళ్లబోయాడు. మళ్ళీ ఇబ్రహీంషా, "ఆఅమ్మాయి ఎవరైనా సౌందర్యమే ప్రధానం కాదు; రాజ లీవి ధైర్యసాహసాలు కలదై వుండాలి" అన్నాడు.

## 5

కాలచక్రం దొర్లిపోయింది. ఇబ్రహీంషా మరణించడం మహమ్మద్ కూలి కుతుబ్‌షా 1580 లో రాజ్యాభిషిక్తుడవడం జరిగింది. భాగ్యమతి పట్టమహిషి అయింది. సిలాఖా

నా దక్షిణముగా ఆవిడకై ప్రత్యేక భవనం నిర్మించారు. అంబర్ ఖానాకు సమీపంలోనున్న గుహలో ఒక దేవాలయం నిర్మించారు, భాగ్యమతికోసం. ఆవిడ రోజూ అక్కడే దేవీ పూజ కావించుకునేది.

మహమ్మద్ కూలి కూతుబ్ షా సుల్తాన్‌గా వున్నప్పటికి దాదాపు ఆంధ్రదేశమంతా గోల్కొండ నవాబుల పాలనలోకి వచ్చింది.

మహమ్మద్ కుతుబ్ షా కూడా హిందూ, మహమ్మదీయ సఖ్యతకోసం యెంతో పాటుపడ్డాడు.

రాజ్యానికి వచ్చిన పది సంవత్సరాల తర్వాత 1589 లో, గోల్కొండ సుల్తాన్ మహమ్మద్ కూలి కుతుబ్ షా సతీ సపరివారంగా తాము కట్టించిన చార్‌మినార్‌ను చూడ్డానికి వెళ్ళారు.

ప్రక్కనే జుమ్మా మసీదు గొప్పగా నేత్రానందాన్ని కలిగిస్తోంది. లెక్కలేనన్ని పావురాలు మశీదు మీద నివాసం చేసుకున్నాయి.

మూసీనది కిరువైపులా పూర్వపు పల్లెటూరు పెద్దబస్తీగా మారిపోయింది. చార్‌మినార్ చుట్టూ చార్‌కమాన్లు నిర్మించ బడ్డాయి.

విదేశీ వ్యాపారస్థులందరూ ఇక్కడే నివాసాలు ఏర్పర్చుకొని, అవసరమున్నప్పుడు దుర్గానికి వెళ్లి వస్తోవుండేవారు.

విదేశీ రాయబారుల నివాసాలుకూడా ఇక్కడేవుండేవి.

భాగ్యమతితో బాటు సుల్తాన్ చార్‌మినార్ ఎక్కారు. అక్కడ పైన ఒక ప్రక్క మశీదు, మరొక ప్రక్క దేవా

ఇదే

గ్రంథకర్త వ్రాసిన కథా సాహిత్య పాఠ్య గ్రంథం!

కథా రచనపై వెలువడిన ప్రప్రథమ గ్రంథం!!

# కథలు రాయడమెలా?

పరిచయ వాక్యాలు:

శ్రీయుతులు కొడవటిగంటి, కాళోజి గారలు.

## వెల 1-8-0

ప్రతి కథకుడు, విమర్శకుడు చదువవలసిన గ్రంథం!

ప్రతి గ్రంథాలయానికీ, పాఠశాలకూ అత్యావశ్యకమైన గ్రంథం!!

ప్రతి ప్రారంభ రచయితకూ ఆవశ్యక పఠనీయ గ్రంథం!!!

## ప్రముఖ పత్రికల, ప్రసిద్ధ కథకుల అభిప్రాయాలు

ఆంధ్రప్రభ- దినపత్రిక: "కథలు రాయడం మాటలతో పని కాదు. ఇది ఒక కళ. దీనిలో అనంతమైన శిల్ప సౌందర్యం ఉంది. కథను ఎలా ప్రారంభించాలి, ఎలా దీనికి క్లయిమాక్స్ సృష్టించాలి, ఎలా ముగించాలి అనే అంశాలు ప్రధానంగా ప్రసిద్ధ రచయితల అభిప్రాయాలతో, ఉదాహరణలతో ప్రసిద్ధ కథకులు శ్రీ పోరంకి కృష్ణమూర్తిగారు రచించిన గ్రంథమిది. కథకులు కాగోరే వారికి ఉపయుక్తమైనది..."

కృష్ణా పత్రిక: ..."ఈ గ్రంథం మొత్తం నూరు పుటలకు మించి లేదు. కాని ప్రతి పుటలో ప్రతీ వాక్యం అభ్యాసమునకు ఉపయుక్తమైన భావాన్ని అందిస్తూన్నది. కథా శిల్పంలో సిద్ధహస్తులు కావాలని ఆశించే సాధకులు అవశ్యంగా పఠించి మననం చేయ తగింది ఈ గ్రంథం..."

ఆంధ్ర పత్రిక- దిన పత్రిక: "...దీనిలో రచయిత రక రకాల కథలు అవి వ్రాసే విధానాలు మొదలైన విషయాలన్నీ వివరించి వ్రాశారు. కథలు వ్రాయడం ఎలాగో తెల్సినంత మాత్రాన మంచి కథలు రాయడం అలవడదు. కాని శిల్పానికి సంబంధించిన విషయం ఇందులో వివరంగా వ్రాసినందు వల్ల ఇది మొట్ట మొదటగా కథలు వ్రాసే వారికి కొంత వరకు ఉపయోగిస్తుంది..."

ఆంధ్ర పత్రిక- వార పత్రిక: "...కాగితం మీద రెండు వేపులా వ్రాయ వచ్చునా లేదా, పత్రికలకు కథ ఎలా పంపించాలి వగైరా అతి సాధారణ విషయాల దగ్గర్నుంచి అన్ని విషయాలూ వివరంగా రచయిత వ్రాశారు..."

గోలకొండ పత్రిక: ".. నూతనంగా కథలు వ్రాయగోరే వారికి ఉపయుక్తంగా నుండుటే ఈ గ్రంథం యొక్క ప్రధానోద్దేశం. ఒక దశాబ్దానికి పైగా కథలు వ్రాస్తున్న కృష్ణమూర్తి గారి అనుభవాలిందులో ప్రతిబింబిస్తున్నవి. కథలు వ్రాయ ప్రయత్నించువారు దీని వల్ల లాభ పడ వచ్చును..."

జాగృతి: "...బ్రతుక్కి దగ్గిర బంధువూ, జీవితానికి చిరపరిచితమూ అయిన చిన్న కథను గూర్చి శ్రీ పోంటి కృష్ణమూర్తి గారు సేకరించిన పలువురు ప్రముఖుల అభిప్రాయాలూ, స్వయంగా వివరించిన తీరు తెన్నులూ ఈ పుస్తక రూపం పొందాయి .."

కాకతీయ పత్రిక: "...ఈ పుస్తకం 'కథారచన'ను విశ్లేషించి వివరించుటకు ఉద్దేశింపబడినది. కాబట్టి దీన్నొక సిద్ధాంత గ్రంథం అని చెప్ప వచ్చి వుంటుంది..."

శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి: "...'కథలు రాయడమెలా?' అనే మీ గ్రంథం చదివాను. కథా రచన విషయమ్మై మీ చర్చ సాకల్యంగా

ఉంది. కొత్తగా కథలు రాసే వారికి గ్రంథం చాలా ఉపయోగిస్తుంది..."

శ్రీ ధనికొండ హనుమంతరావు: "...కథలు రాయాలనే కుతూహలం వున్న వారికి ఈ పుస్తకం ఉత్సాహాన్నివ్వటమే గాక, ఒక దారి చూప గలుగుతోంది... కథలు రాసే విధానం మీద మొదటి పుస్తకాన్ని వెలువరించిన మీకు ధన్యవాదాలు."

శ్రీ బుచ్చిబాబు: "...మీ గ్రంథం చదివాను. ఈ రకమైన ఉపయోగకరమైన గ్రంథాలు మన భాషలో లేవు. చిన్న కథలు వ్రాయాలని కుతూహలపడే వారికి ఇది చాలా అభిరుచిని కలిగిస్తుంది. కొంత మంది రచయితల ఆధారంతో కథను విశ్లేషించి కొన్ని నియమాలను ఏర్పరచారు... ఈ పుస్తకం శిల్పాన్ని గురించిన ఆలోచనను రగిలిస్తుంది..." (ఆంగ్లవాక్యాలకు ఆంధ్రీకరణము)

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు: "...కథకులు కాబోయేవారు తమ బాధ్యతను తెలుసుకోనటానికీ, అయోమయ స్థితిలో కథా రచనను సాగించుతున్న వారు ఒక దారికి రావటానికీ ఈ పుస్తకం వినియోగపడగలదని ఆశిస్తున్నాను."

శ్రీ కాకోజి నారాయణరావు: "...కథా రచనకు సంబంధించిన అన్ని అంశాలను సవిస్తరముగ చర్చించి కథారచనకు పూనుకొన దలిచిన తెలుగు ఉత్సాహవంతులగు వారి కందరకు ఒక అమూల్య గ్రంథమును సమర్పించినారు."

శ్రీ 'ఉదధి': ...కథా రచనను గురించి 'కథలు రాయడమెలా?' అన్న పుస్తకంలో శ్రీ కృష్ణమూర్తిగారు చర్చించారు. ఇది కథలకు సంబంధించిన 'రిఫరెన్సుబుక్' అన వచ్చు. కృష్ణమూర్తి గారు చాలాకాలం నుండి కథలు వ్రాస్తున్న సాహిత్యకులు."

త్వరలో...

కాళోజి కథలు

మాచిరాజు కథలు

"కృష్ణ పక్ష" జీవితాలు

భావ విహంగాలు

"వినగదప్ప వెఱ్ఱి వెంగళప్ప!"

.... వెలువడును

KRISHNANJALI

[A Collection of

**Price One Rup**

BY SONTI KRISHNA MOORTY



## పరిచయం.

తెలుగుదేశంలో విద్యార్థిదశనుండి కథారచనలో విఖ్యాతులై, ప్రాచ్య పాశ్చాత్య రీతుల సమ్మేళనతో ప్రప్రథమంగా "కథలు రాయడమెలా?" అనే గ్రంథాన్ని రచించి, సారస్వత సేవచేస్తూ తెలుగువారి మన్ననలకు పాత్రులయ్యారు, శ్రీ శొంఠి కృష్ణమూర్తి గారు. 'కృష్ణమూర్తి కథలు' వీరి మరొక ప్రచురిత గ్రంథం.

"కల్పన", "'కృష్ణపక్ష' జీవితాలు", "సంసార సాగరంలో సహధర్మచారిణులు..." వీరి కొన్ని అముద్రితగ్రంథాలు.

కేవలం వినోదంకోసమే గాక, విజ్ఞాన వికాసాలకు సాహిత్యరంగాన్ని సాధనగాచేసి, జాత్యభ్యుదయం చేకూర్చడం వీరి జీవిత లక్ష్యం కావడం ముదావహం.

*Yasodhara Publication.*

Press, Warangal.